ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# సాతవాహనానంతరీకులు

(క్రీ. శ. 200-625 ప్రాంతము)




రచయిత

యీరంకి సూర్యనారాయణమూర్తి






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్

హైదరాబాదు

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్ద లందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వ యుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్ర దాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను ధృడతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహద కారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసి ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు.

ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజుల పాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదం చేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంధ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి. కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయిత లందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయు లందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయ గలదని నమ్ముతున్నాను.

**జలగం వెంగళరావు**
**అధ్యక్షులు**
ప్రపంచ తెలుగు మహాసభలు

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975 వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో నివసించు చున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటైనది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్య క్రమాల సమన్వయసంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్రభాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వాహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది ఆ విద్వత్సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప

వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకులు మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతమ వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ 'సాతవాహనానంతరీకులు' అను గ్రంథమును, రచించిన శ్రీ యీరంకి సూర్యనారాయణమూర్తి ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన శివాజీ ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు
19-3-1975

# విషయసూచిక

# ప్రస్తావన

వింధ్యపర్వతశ్రేణికి దక్షిణమున నున్న ప్రదేశము, పెన్నానది వరకు, దక్షిణాపథమని పేరుపొందినది. చారిత్రకయుగమునుండి ఈ ప్రదేశము ప్రాముఖ్యము వహించినది. మౌర్యులకాలమున మెగస్థనీస్ కథనము ప్రకారము, ఈ దక్షిణాపథము, తూర్పుభాగము కళింగరాజ్యము క్రిందను, పశ్చిమభాగము సాతవాహన రాజ్యము క్రిందను, ఉన్నట్లగుపించును. ఈ రెండును ఈ ప్రదేశమున ప్రబలరాజ్యములయినను అవి మగధసార్వభౌమత్వము నంగీకరించినవి. బిందుసారుడు మరణించి అశోకుడు సామ్రాట్టు అయేలోగా కళింగము స్వతంత్రముకా ప్రయత్నించెను కాని, అశోకుడు దానిని క్రూరముగా అణచివేసెను. దీనివలనను, అశోకునితరువాత, మగధ క్షీణదశలో, కళింగ రాజైన ఖారవేలుడు మగధపై ఎత్తివెళ్ళిన దక్షిణాపథ రాజులలో ప్రప్రథముడగుటచేతను, కళింగరాజ్యము, సాతవాహన రాజ్యము కంటె ప్రబలముగా నుండినట్లు తోచును. అంతియేకాక ఆ రాజ్యము ఖారవేలుని కాలములో సామ్రాజ్యదశ నందుకొనినట్లుగా తోచును.

పై విషయముల దృష్ట్యా, సాతవాహనుల సామ్రాజ్యాభివృద్ధి, ఖారవేలుని తరువాతనే, కళింగములో ప్రబలులైన రాజులు లేనందున, ప్రారంభ మయినట్లు తోచును. మరియు కళింగ సామ్రాజ్యము అల్పకాలమేమనినది కాని సాతవాహనుల విషయమట్టుకాదు. దక్షిణాపథ పరిస్థితుల దృష్ట్యా వారికి ఈ ప్రదేశములో ఎదురు లేకుండెను. మగధ సామ్రాజ్యము క్షీణత పొందినతరువాత సాతవాహనరాజులనేకులు ప్రబలులై, క్రమేపీ వింధ్యపర్వతములకు దక్షిణముగానున్న పూర్వపు మగధసామ్రాజ్య భాగము నాక్రమించుకొనిరి. అట్లు వారు దక్షిణాపథమునంతను, అశోకుని మరణము తర్వాత క్రమేపీ తమ ఏలుబడి క్రిందికి తెచ్చుకొని నాల్గువందల సంవత్సరములు పరిపాలించి, 'ఏకబ్రాహ్మణుల'ని అన్వర్థనామధేయము నొందిరి.

సాతవాహనులట్లు దక్షిణాపథము నంతటినీ ఒకత్రాటిక్రిందికి, తెచ్చుటేకాక పాటలీపుత్రము నాక్రమించుకొని తమ ప్రాబల్యమును చాటుకొనిరి. ఈ విధముగా కళింగులును, సాతవాహనులును, దక్షిణాపథ సార్వభౌములు తమ ప్రాబల్యమునకు తార్కాణముగా ఉత్తరాపథము పైకి దండు వెడలవలెనను సంప్రదాయమును

స్థాపించిరి. ఈ సంప్రదాయమును తరువాతి దక్షిణ సార్వభౌములలో రాష్ట్రకూటులు, చోళులు పాటించి ఆచరించిరి.

మరియు సాతవాహనులు, మగధ సామంతులుగా ఉండుటచే. మగధలోని మౌర్యుల ఆశయములను, సత్సంప్రదాయములను రాజకీయ, సాంస్కృతిక విషయములను - చక్కగా ఆకళింపుచేసికొని, వాటిని పునరుద్ధరించవలసిన ఆవశ్యకతను గ్రహించి, పునరుద్ధరించిరి. ఉత్తరాపథమున సామ్రాజ్య క్షీణతచే రాజకీయ సాంస్కృతిక ఐక్యతను నిలబెట్టుట సాధ్యముకాలేదు. ఆంతరంగిక పరిస్థితులు అచ్చట రానురాను విషమించెను, దానికితోడు విదేశీయ దండయాత్రలు పరిస్థితులను మరింత క్లిష్టపరచెను. అట కుషాను సామ్రాజ్య ప్రారంభము వరకు పరిస్థితులు మెరుగుకాలేదు.

కాని, దక్షిణాపథమున అట్లుగాక, సాతవాహనులనాయకత్వమున సామ్రాజ్య స్థాపన ఆరంభమయ్యెను. మౌర్యుల తరువాత కాలమున ఉత్తర, దక్షిణాపథముల గతిలో ఒక సామ్యము మాత్రము కలదు. ఉత్తరమున శుంగులు, కణ్వులు, దక్షిణమున సాతవాహనులు బ్రాహ్మణ చక్రవర్తులే. శుంగులు, సాతవాహనులు కొన్ని బ్రాహ్మణరాజకీయ సాంప్రదాయములను పువరుద్ధరించిరి. ఇందు ముఖ్యముగా, తమ రాజకీయ ప్రాబల్య చిహ్నముగా అశ్వమేధముల నొనర్చిరి. ఇది తప్ప మిగత విషయములలో మౌర్యచక్రవర్తి సత్సంప్రదాయములను పాటించిరి. ముఖ్యముగా సర్వమానవ, మతసమానత్వములను పాటించి, అందరిని కన్న బిడ్డల వలె చూడవలెనను అశోకుని సాంప్రదాయమును పాటించిరి. అట్లు అందరి మంచి చెడ్డలనూ చూచిరి. మంచి ఎచ్చటనున్నను ప్రోత్సహించి, చెడు ఎచ్చటనున్నను నిరోధించిరి. ఇట్లు సాతవాహన సార్వభౌముల అధ్వర్యమున దక్షిణాపథమున అశోక మౌర్యుడు నెలకొల్పిన సత్సంప్రదాము లవిచ్ఛిన్నముగ సాగినవి. దీనికి కారణము వారు దక్షిణాపథమున రాజకీయ సాంస్కృతి కైకమత్యమును నిలబెట్ట గల్గుటయే.

దక్షిణాపథ భౌగోళిక పరిస్థితులదృష్ట్యా ఇది సులభముకాదు. ఉత్తరాపథము భౌగోళిక పరిస్థితుల దృష్ట్యా భారతీయ సామ్రాజ్యస్థాపనకు తగియుండగా, దక్షిణాపథమట్లు కాదు. దక్షిథాపథము త్రిభుజాకారద్వీపకల్పమై దక్షిణమునకు పోనుపోను సన్నమగుచు, చిన్నచిన్న సహజవిభాగములుగా నున్నది. అందుచే ఇందు ఇంచుమించు సమానబలముగల రాజ్యములే వృద్ధిపొంద అవకాశమున్నది, ఏదైనా

రాజ్యము తన సహజ బల సంపదలతో మిగిలినవాని నధిగమించిన, కొంతసామ్రాజ్యాధిపత్యము పొందగలుగును. అట్లు చేయలేనివాడు మరల దక్షిణాపథము చీలికలగుచుండును. మరియును దక్షిణాపథ సామ్రాజ్యములు ఎప్పుడునూ అప్రమత్తతతో తమ ఆధిపత్యము నిలపెట్టుకొనుచుండవలెను. వాటికి తమ బల సంపదలను అందుకే వినియోగించవలసి యుండును. కావున, ఈ పరిస్థితులవలన ఆ సామ్రాజ్యములు దక్షిణాపథము దాటనేరవు. సాతవాహన సామ్రాజ్యచరిత్రయే దాని కుదాహరణము.

సాతవాహనులు క్రమేపీ బలము సంతరించుకొని, మగధ సామ్రాజ్యము దక్షిణాపథమున విస్తరించుటకు పూర్వమే, దక్షిణాపథమునందు ప్రబలులై యుండవలెను. వారినిగురించి కళింగులతోపాటు మెగస్థనీస్ ప్రస్తావన, మౌర్య సామ్రాజ్యకాలములోను, అశోకునితరువాత, కళింగుల ప్రవర్తన ఈ ఊహకు దారి తీయుచున్నవి. మరియును సాతవాహనులు, కళింగులు సమానబలము కలవారై కూడ యుండవలయును. కాని వారు మౌర్యప్రాభవమునకు తలయొగ్గి స్వతంత్ర ప్రతిపత్తికల రాజ్యములుగా అశోకుని మృతిదనుక మనవలసి వచ్చెను. కాని నందుల కాలమునుంచి జరిగిన మగధసామ్రాజ్య విస్తరణ ప్రయత్నములు, చివరకు సాతవాహనుల సామ్రాజ్య కార్యమును సులభమొనర్చెను. పరిస్థితులు కూడా వారికి తోడ్పడినవి.

అశోకుడు క్రూరముగా అణచివేసినా, అతని మరణానంతరము కళింగులు ఖారవేలుని ఆధిపత్యములో మరల తమ బలమును సంతరించికొని పాటలీపుత్రముపై దండువెడలి, మగధపై పగతీర్చుకొనిరి. పైన చెప్పినట్లు అది వారి బలమునకు అత్యున్నత చిహ్నమైనది. దీనికితోడు ఖారవేలుని తర్వాత ఆ బలమును నిలుపుటకు కూడా సరి అయినవారు లేకపోయిరి. ఇది అంతయు సాతవాహనుల కనుకూలముగా పరిణమించి వారిసామ్రాజ్య విస్తరణకు, తోడ్పడెను. వారు క్రమేణా దక్షిణాపథమంతయు విస్తరించిరి. మౌర్యసామ్రాజ్య విస్తరణ వలన చిన్నచిన్న సమానబలముకల స్వతంత్ర రాజ్యములుండ వీలులేకపోయెను. అట్లు సాతవాహనులు, మౌర్య సామ్రాజ్యము క్షీణించగా, దక్షిణాపథమున మౌర్య సామ్రాజ్యమునకు వారసులై పెంపొందిరి.

అశోకుని తరువాత వారి పరిపాలనాకాలము నాల్గువందల సంవత్సరముల వరకు నుండెను. ఈ సుదీర్ఘ కాలములో వృద్ధి క్షయముములు ఒడుదుడుకులు ఉన్నవి.

అయినను సమర్థులగు చక్రవర్తులుద్భవించి సాతవాహన సామ్రాజ్యము పతనమందకుండ నిలువబెట్టుచూ వచ్చిరి. మరియు ఉత్తరాపథమున మగధసామ్రాజ్యము క్షీణించగా అది క్రమేణా విదేశీయుల దండయాత్రలకు గురిఅయ్యెను. ఆ విదేశీయులందరు భారతీయ సంస్కృతి ప్రభావమునకు లొంగిపోయిరి. భారతదేశప్రజలలో వారు కలసిపోయిరి. వారి సంస్కృతి భారత సంస్కృతిలో విలీనమై దానికి వన్నె తెచ్చెను. ఆ జాతులన్నియు శకులని సాధారణ నామధేయము నొందిరి. ఆ శక జాతులలో చివరివారైన కుషాణులు ఉత్తరాపథమున సామ్రాజ్యము స్థాపించి, భారతదేశము వాయువ్యపు ఎల్లల కావలి భాగములను కూడ లోబర్చుకొని తమ సామ్రాజ్యమును భారతీయసాంప్రదాయము ప్రకారము, ముఖ్యముగా అశోకసాంప్రదాయ ప్రకారము, పాలించిరి. వారట్లు సాతవాహనులకు ఉత్తరమున సమకాలికులును, అశోకుని వారసులును అయిరి.

ఈ శకజాతులు దక్షిణాపథమున కూడా విస్తరించినవి. ముఖ్యముగా క్షాత్రవులు(శకక్షాత్రవులనికూడా అందురు) దక్కనులో వాయవ్యభాగమున స్థిరపడి సాతవాహనులకు పక్కలో బల్లెమువలె నుండెడివారు. అయినను ఈపరిస్థితుల నెదుర్కొని సాతవాహన రాజ్యమును వరుసగ ముప్పదిమంది చక్రవర్తులు పరిపాలించిరి. వారిలో బలవంతులు, బలహీనులు ఓతప్రోతముగా నుండిరి. బలహీనుల కాలములో బలహీనమైన పరిస్థితులను బలవంతులు చక్కజేయుచు వచ్చిరి. అట్లుచేసిన వారిలో చివరి చక్రవర్తి గౌతమీపుత్ర యజ్ఞశ్రీశాతకర్ణి. ఆతెని అనంతరము పరిస్థితులనట్లు చక్కజేయ వీలుపడకపోవుటచే సాతహహన సామ్రాజ్యము చీలికలై క్షీణించినది. సాతవాహన వంశము కాలగర్భములో కలసి పోయినది. ఏదైనా వంశముగాని, రాజ్యముగాని, సామ్రాజ్యముగాని శాశ్వతముగా, నిరంతరముగా నుండజాలదు. వాటికిని వ్యక్తులవలె జీవనప్రమాణముండును. అటులనే సాతవాహనులకు వారి సామ్రాజ్యమునకు కూడా. మూడవశతాబ్దిచివరకు సాతవాహనులు వారిసామ్రాజ్యము అంతర్ధాన మయ్యెను. మరల నాల్గు వందల సంవత్సరముల వరకు, అనగా బాదామి చాళుక్యు లుద్భవించునంతవరకును దక్షిణాపథము చీలికలుగానే ఉండవలసి వచ్చెను. ఇట్లు ఏడవశతాబ్దము వరకు ఉండవలసి వచ్చెను. మధ్యకాలములో గుప్తులు, తమ సామ్రాజ్య పూర్వీకులవలె దక్షిణాపథమున తమ ప్రాభవమును స్థాపించ యత్నించినా, ఈ రెండవ మగధప్రాభవము మొదటిదానివలె సాగినది కాదు. వారిది చాల తాత్కాలిక ప్రాభవమై యుండెను. వారు దక్షిణాపథ రాజ్య

ములను కొన్నింటిని నిర్జించినను అవియును, మిగతరాజ్యములును వారి సార్వభౌమ త్వము నంగీకరించగనే తృప్తిపడి వాని నట్టుండ నిచ్చిరి.

సాతవాహనుల తరువాత వారి అనంతరీకులు వారి సామ్రాజ్యభాగము లన్నింటిలో, అనగా అన్ని దిగ్భాగములలోను బయల్వెడలి, తమ ఓపినంతవరకు దక్షిణాపథమును మరల సుస్థిరముచేసి, శాంతి, భద్రతలను నెలకొల్ప సమకట్టిరి. కాని వారి ప్రయత్నములు విఫలమయ్యెను.

మన ప్రకృత విషయము ఆంధ్రప్రాంతమున, అనగా సాతవాహనసామ్రాజ్య తూర్పు భాగమున, సాతవాహనానంతరీకులు. వారు మూడవ శతాబ్దినుండి, ఏడవ శతాబ్దివరకు ఈ ఆంధ్రప్రాంతమున శాంతి భద్రతలను నెలకొలిపి, సాతవాహన సామ్రాజ్య సాంప్రదాయములను పునరుద్ధరించ ప్రయత్నించిరి. ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, ఆనందులు, సాలంకాయనులు, విష్ణుకుండినులు, పూర్వపల్లవులు సాతవాహనానంతరీకులుగా పేరొందిరి. వారందరు తమతమ శక్తిసామర్థ్యముల ప్రకారము తమ ధర్మమును నిర్వహించి, శాంతిభద్రతలు స్థాపించి, సత్సంప్రదాయ మును పునరుద్ధరించి, నిర్వహించ సమకట్టిరి. వీరందరు ప్రాంతీయ రాజులైనందున తమ ప్రాంతమునకు, తమ ప్రయత్నములతో ఒక వ్యక్తిత్వమును కూడ సంతరించ కలిగిరి. అట్లు ముఖ్యముగా ఆంధ్రవ్యక్తిత్వము ఆంధ్రప్రాంతమున పెంపొంది, వారి అధ్వర్యములో విలసిల్లినది. తరువాతి సామ్రాజ్యములు ఆ వ్యక్తిత్వమును భంగ పరచలేకపోయినవి. అందుచే సాతవాహనానంతరీకుల చరిత్ర, రాజకీయముల దృష్ట్యా పరిగణన నొందకున్నను. ఈ దృష్ట్యా ముఖ్యమైనదనుటచే, దానిని సాధ్యమైనంత వివేచనా దృష్టితో పరికించి పరిశీలించవలెను.

# 2. ఇక్ష్వాకులు

## (క్రీ. శ. 200 - 260 ప్రాంతము)

ఇక్ష్వాకుల ప్రాకృత శాసనములు జగ్గయ్యపేటవద్ద, నాగార్జునకొండ రామి రెడ్డిపల్లివద్ద దొరికినవి. లిపినిబట్టి వానిని మూడవ శతాబ్ది మధ్యభాగమునకు, ఆ శతాబ్దపు ఉత్తరభాగమునకు చెందునని భావించిరి. మత్స్యపురాణాదుల కథనము ప్రకారము ఆంధ్ర సామ్రాట్టుల పతనానంతరము వారి సామంతులైన మూడు వంశములవారు మూడవశతాబ్దిలో స్వతంత్రులై ప్రభవిల్లినట్లు కన్పడును. వారు ఆభీరులు, ఆంధ్రభృత్యులు, శ్రీపర్వతీయులు. ఆంధ్రభృత్యులు శ్రీపర్వతీయులు చెరియొక అర్ధశతాబ్దికాలము పరిపాలించినట్లగుపడును. వారి పలపాలనా కాలము, అందలి సంఘటనలు పురాణకథనము పరస్పరము అంగీకరించికొనుచున్నవి.

సాతవాహనులు ఆంధ్రభృత్యులను పశ్చిమ తీరము రక్షించుటకు, శ్రీపర్వతీయులను తూర్పుతీరము రక్షించుటకు, నియమించినట్లగుపడును. నాగార్జున లోయలో దొరికిన శాసనములు ఇతర పురావస్తు సముదాయము శ్రీపర్వతీయాంధ్ర వంశము ఇక్ష్వాకువంశమని తెలియచేయుచున్నవి. వారు ఆంధ్రదేశమును, ఇతర పరిసర ప్రాంతములను విజయపురిని రాజధానిగా చేసికొని పాలించిరి. ఈ విజయ పురివద్ద ప్రముఖమైన శ్రీపర్వతముండుటచే పురాణములు వారిని శ్రీపర్వతీయులుగా పేర్కొనెను. ఆంధ్రభృత్యులు సామ్రాట్టులు కాలేకపోగా, ఇక్ష్వాకులు సామ్రాట్టులైరి.

ఇక్ష్వాకులు కూడ సాతవాహనులవలె తమ నామధేయముతో పాటు తమ మాతృనామధేయమును కూడ తెలియపరచుకొనిరి. ఇతరులెవరు ఇట్లుచేయలేదు. ఇట్లు ఇక్ష్వాకులు సాతవాహనసంప్రదాయమును అన్నివిషయములలోను పాటించిరి. అందుచేత వీరు సాతవాహనుల వెనువెంటనే ఆంధ్రదేశము నేలిరని వారితో రక్త సంబంధము కలిగి యుండిరని తోచును.

ఇంతేకాక ఇక్ష్వాకులు సాతవాహనులకు పూర్వమే ఆంధ్రదేశమున పాలకులని, సాతవాహనులకు తరువాత సామంతులైరని తోచును. ఏదయిన ప్రాతవిషయమును

'ఇద ఇక్ష్వాకులనాటిద'ని పేర్కొను ప్రతీతికలదు. సాతవాహనులు, ఇక్ష్వాకులు తమ సామంతులుకాగానే, ఆంధ్రదేశ పరిపాలనను వారికే వదలివేసినట్లు తోచును.

ఇక్ష్వాకులు ఉత్తరమునుండి వచ్చి ఇచ్చట స్థిరపడిరి. ఋగ్వేదము ఇక్ష్వాకు డనురాజును పేర్కొనుచున్నది. ఇది అసమాతి అనువాని వంశనామమై యుండ వచ్చును. అథర్వవేదము కూడ ఇట్లు పేర్కొనుచున్నది. పురుకుత్సుని ఇక్ష్వాకుడని శతపథ బ్రాహ్మణము చెప్పుటచేత త్రసదస్యునకు ఇక్ష్వాకులతో సంబంధమున్నదని ఇక్ష్వాకులకు పూరులు లెక పౌరవులతో సంబంధ మున్నదని తెలియుచున్నది. ఇక్ష్వాకులు పలువురు ఉత్తరభారతమును పరిపాలించుచున్నట్లు ప్రస్తావన ఉన్నది. బుద్ధుని కూడ ఇక్ష్వాకు వంశీయుడనిరి. ఇట్లు ఇక్ష్వాకులు భారతదేశపు వివిధ భాగములను పరిపాలించి చాల ప్రాచీనత కలిగియున్నట్లు తోచును. పురాణములు నలుబది ఎనిమిదిమంది ఇక్ష్వాకులు దక్షిణ భారతమును పాలించినట్లు చెప్పుచున్నవి. ఆంధ్రదేశమును పాలించినవారు వారిలో ఒకరై తమ వంశము ఇచ్చట స్థాపించినట్లు తోచును.

ఇక్ష్వాకులు దక్షిణమునకు క్రీ. పూ. ఆరవశతాబ్ది ప్రాంతమున తరలివచ్చి నట్లు తోచును. ఆకాలమున కోసలరాజ్య క్షీణత, మగధ ఉన్నతి ప్రారంభమయ్యెను. మహాకోసల లేక దక్షిణకోసల అను దక్షిణాపథరాజ్యముల పేరులు దానిని తెలియ చేయుచున్నవి.

ఇక్ష్వాకులను గూర్చి ఈవంశనామమునుగూర్చి మరికొన్ని అభిప్రాయములు కూడ కలవు. కాల్డ్‌వెల్, ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చిన క్షత్రియేతరులని అభిప్రాయపడుచున్నారు. ఇక్ష్వాకు నామము ఇక్షు అనగా చెఱకుతో సంబంధించిన దగుటచే వీరు ఆర్యుల ప్రాభవమునకు లోనైన అనార్యులుగాని, లేక ఆర్యులైనను వీరికి అనార్యులతో ఎక్కువ సంబంధములుండి కొన్ని అనార్యఐతిహ్యములను (వృక్షజాతులనుండి మనుజుల ప్రాదుర్భావము మున్నగునవి) గైకొనిరేమోనని తోచును. తరువాత ఈ ఇక్ష్వాకులలో ఉండిన మేనరికపుటాచారము కూడ వారికి అనార్యసంబంధములు హెచ్చుగా నుండినట్లు తెలియచేయును. ఏమయినను, వారు సాతవాహనుల తర్వాత ఆంధ్రదేశమున అర్ధశతాబ్దము పరకు సాతవాహనుల సాంప్రదాయముల ప్రకారము సుపరిపాలన సాగునట్లు చేయకల్గి సామ్రాజ్య వైభవమును పొంద గలిగిరి.

## 1. ఇక్ష్వాకువంశ ప్రాభవము : వాశిష్ఠిపుత్ర శ్రీ శాంతమూలుడు (క్రీ. శ. 200-218 ప్రాంతము) :

శ్రీ యజ్ఞశాతకర్ణి. అనంతరము సాతవాహనులు బలహీనులై క్షీణింప నారంభించిరి. ఇది అదనుగా తీసికొని ఆంధ్రదేశమున వారి సామంతుడును, ప్రబలుడును, విజయపురాధీశ్వరుడు అయిన శాంతమూలుడు, తన రాజధానికి సమీపముననున్న సాతవాహనుల తూర్పుసామ్రాజ్య రాజధానియైన ధాన్యకటకము నాక్రమించుకొని, సాతవాహనుల అధికారమును కూలద్రోసెను. ఇందు అతనికి ఇతర సామంతులు తోడ్పడిరి. తరువాత తన బలపరాక్రమములచే ఆంధ్ర దేశమును నిర్జించి ఇచ్చట ఇక్ష్వాకుల సామ్రాజ్యమును నెలకొల్పెను. ఇతని పూర్వీకులు క్రమేపీ ఆంధ్ర మధ్యభాగమున బలవంతులై, సాతవాహనుల సామంతులైనను వారితో సంబంధ బాంధవ్యములను కల్గియుండిరి. ఆంధ్రదేశమున వారికేడుగడగా నుండిరి. పురాణ కథనము ప్రకారము చంద్రశ్రీ. సాతవాహనులలో చివరి వాడుగా తోచును. నాల్గవ పులుమావి తరువాత అక్రమముగా అధికారము నాక్రమించినట్లు తోచును. శాంతమూలుడీతని అధికారమును ధిక్కరించి స్వతంత్ర సామ్రాజ్యమును ఆంధ్రదేశమున నెలకొల్పినట్లు తోచును. మూడవశతాబ్ది ప్రారంభ మున ఈతడు సామ్రాజ్యమును స్థాపించి అశ్వమేధ, వాజపేయముల నొనర్చి దక్షిణాపథ సామ్రాట్టు అయ్యెను.

శాంతమూలుని సామ్రాజ్యము దక్కను పీఠభూమి తూర్పుభాగ మంతటిని, దక్షిణకోసలముతో సహా, ఆవరించినట్లు తోచును. అతడు నిర్జించిన రాజ్యములు, వంశములు ఏవో మాత్రము తెలియదు, ఆభీరగోవర్ధనుడు, ఉజ్జయినీ మహాక్షత్రపు డైన మొదటి రుద్రసేనుడు అతనిమైత్రి నర్థించిరి. ఉజ్జయినీ రాకుమార్తె రుద్రధర భట్టారికను శాతమూలుని పుత్రుడైన వీరపురుష దత్తుడు పెండ్లాడెను. దీనివలన ఇక్ష్వాకుల ప్రతిష్ఠ ఇనుమడించెను. ఆంధ్రభృత్యులు లేక చూటు శాతకర్ణులు కూడ వారి సహాయము నర్థించి స్వతంత్రులైనట్లు తోచును.

ఇక్ష్వాకుల చరిత్ర వారి కుమార్తెల శాసనముల వలన తెలియుచున్నది. ఇట్లే ఇతర ఉన్నత కుటుంబస్త్రీ లిచ్చిన శాసనములును ఉన్నవి. అవి ఇక్ష్వాకుల ప్రాదుర్భావమును తెలుపకపోయినను, ఇక్ష్వాకు చక్రవర్తుల కార్యములు చెప్పు చున్నను. ఇక్ష్వాకువంశ చరిత్రను నిర్మించుటకు, ఆ కాలపు మతపరిస్థితులు తెలుసు కొనుటకు తోడ్పడును. ఇవి పాకృతభాషలో నున్నవి. ఇవి ముగ్గురు రాజులను

పేర్కొనుచున్నవి. మొదటివాడు వాశిష్ఠీపుత్ర శ్రీశాంతిమూలుడు. ఇతనిని 'ఇఖాకు స్వామి' (ఇక్ష్వాకు స్వామి) అని సాతవాహన సంప్రదాయ ప్రకారము పిల్చుచున్నవి. ఇతనిని గురించి ఇతని పుత్రుని, పౌత్రుని శాసనములే తెల్పును. అవి అతనిని చాల ప్రస్తుతించుటచే అతడు దక్షిణాపథమున చాల ప్రబలుడని తెలియ చేయుచున్నవి. అతని సమకాలికులు, వారసులు అతనిని సామ్రాట్టుగా పరిగణించిరి. చూటుశాతకర్ణులు, ఆభీరులు, మాళ్వ మహాక్షాత్రవులు ఇట్లు సామ్రాట్టులమని ప్రకటించుకొనలేదు. శాసనము లన్నియు ఇతనిని మహారాజ వాశిష్ఠీపుత్ర శాంతిమూలుడు 'సావధేసు అపతిహత సంకపస' ('అజేయ మయిన సంకల్పము కలవాడని, అప్రతిహతుడని) 'అగిహోత, అగిధోమ; వాజపేయ, అశ్వమేధ యాజిన' (అగ్నిహోత్ర, అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ. యాజిన) 'హిరణ కోటి, గోశతసహస. హలశతసహస పదాయిస' (కోట్లు లక్షల సువర్ణములు, గోవులు, హలములు ఇచ్చినవాడు) అని పేర్కొన్నవి. మరియు 'విరూపాఖపతి. మహాసేన పరిగహతస' (సర్వరాజగు విరూపాక్షుని అభయమొందినవాడు) అని కూడ చెప్పుచున్నవి. ఇది ఈతడు శైవుడని తెలియచేయుచున్నవి. వైదిక బ్రాహ్మణ మతానుయాయి అని కూడ తోచును. శాసనము లీతడొక్కడే వైదికకర్మ లాచరించినట్లు చెప్పుచున్నవి. అందుచే ఈతడు చాలకాలమునుండి విస్మృతమైన వైదికకర్మలను. మతమును పునరుద్ధరించినట్లు తోచును. అతని మాతృగోత్రము, మాఠరీగోత్ర బ్రాహ్మణితో అతని వివాహము, అతడు సాతవాహనులవలె బ్రాహ్మణుడని తెలియచేయుచున్నవి.

భండార్కరువంటి పండితులు ఇక్ష్వాకులు సూర్యవంశ క్షత్రియులని అభిప్రాయపడుచున్నారు. కాని శాసనాధారముల ప్రకారము ఇది సరికాదు. ఇక్ష్వాకులు బ్రాహ్మణులని, బ్రాహ్మణ రాజవంశములతో సంబంధము కల్గియున్నారని అందుచే క్షత్రియులుకాని, సూతులుకానికాదని, స్పష్టముగా తెలియచేయుచున్నవి. వీరిలో హారీత, విష్ణువృద్ధులవంటి ప్రముఖ బ్రాహ్మణులున్నట్లగుపించును. వీరు సాతవాహనులనన్నింట ననుసరించుచు వారివలెనే మాతృగోత్రములను ఉదాహరించిరి. మాతృగోత్రములు దక్షిణాపథ రాజవంశములలో పూర్వము బహుభార్యాత్వమున్నట్లు చూపుచున్నవి. దీనివలన మాతృగోత్రముదహరించుటవసరమైనను, ఇక్ష్వాకులు హారితగోత్రులు కావచ్చును. ఇట్లని వీరు సంబంధ బాంధవ్యములు పెట్టుకొన్న ఇతర బ్రాహ్మణ రాజవంశముల సమాచారమువలన తెలియుచున్నది.

మరియును అగ్నిష్టోమమును బ్రాహ్మణులే చేయవలెను. క్షత్రియు లాచరించిన అది జ్యోతిష్టోమమగును.

శాంతిమూలుని అప్రక బలపరాక్రమములను సార్వభౌమత్వ వైభవములను అశ్వమేధము సూచించును. అస్మక, మూలక, కోసల, కళింగములు అతని సామ్రాజ్యపు టుత్తరభాగముగానున్నట్లుతోచును. గర్దబిల్లులు, ఖురుండులు లేక ముండులు, తుఖారులు, శకులు, యవనులు మున్నగు ప్రాంతీయ రాజులను ఇతడు లోబర్చుకున్నట్లు తోచును. ఆభీరులు, శకమహాక్షాత్రపులు, చూటు శాతకర్ణులు అతని అధికారము నంగీకరించినట్లు తోచును. వీటికిపైగా అతడు నాల్గవ పులుమావిని చంపి ఆంధ్రసామ్రాజ్యమును కూలద్రోసి ఇతరులకన్న అధికుడయ్యెను అందుచే తన సార్వభౌమత్వమును ప్రకటించి వాజపేయ, అశ్వమేధములను చేసెను.

శాసనములు శాంతమూలుని పూర్వీకులను గూర్చి ఏమియు చెప్పలేదు. వారు సాతవాహన సామంతులై యుందురు. శాంతమూలుని పుత్రుడు మాఠరీపుత్ర శ్రీవీరపురుష దత్తుడు (మాఢరి పుత సిరివీరి పురిసదత). అతని కుమార్తె మహాతలవరి అడవి శాంతిశ్రీ. ఈమె మహాతలవర, మహాసేనావతి, మహాదండ నాయక, ధనక వంశీయుడు స్కంధవిశాఖ నాగుని (ఖంద విసాఖంనక) భార్య. శాంతమూలున కిద్దరు చెల్లెండ్రు. ఒకామె మహాసేనాపత్ని, మహాదానపత్ని శాంతిశ్రీ (చాంతి సిరి). పూగీయవంశీయుడు మహాసేనాపతి, మహాతలవర మహాస్కందశ్రీ (మహాఖందసిరి) ఆమెభర్త. ఆమె పుత్రుడు మహాతలవర స్కంద సాగరనాగ (ఖందసాగరంనక). ఆమె పుత్రిక శ్రీవీరపురుషదత్తుని ఒక రాణి. ఇంకొక సోదరి హర్మ్మసిరి (బ్రహ్మ లేక బ్రాహ్మిశ్రీ); ఆమె భర్త పేరు తెలియదు.

శాంతమూలునికి పలువురు భార్యలు, చెల్లెండ్రు ఉండిరి. ఒక శాసనము అతని తల్లులను, భార్యలను, చెల్లెండ్రను ముప్పదిమందిని పేర్కొన్నది కాని వివరములులేవు. శాంతమూలునితో సంబంధబాంధవ్యములుగల నాలుగు సామంత రాజవంశములను శాసనములు పేర్కొనెను. బృహత్పలాయనులు, సాలంకాయనులు కూడ అట్టి సామంతులే. వీరందరు వివిధ సామ్రాజ్యభాగములను పాలించుచుండిరి.

## 2. మాఠరీపుత్ర శ్రీవీరపురుషదత్తుడు (క్రీ. శ. 218-239 ప్రాంతము). ఆంధ్రదేశమున బౌద్ధప్రాభవము :

ఈతని పరిపాలనాకాలము దీర్ఘము, ప్రశాంతము ఐశ్వర్యవంతముగా నుండెను. ఈతడు తన యౌవనారంభమున రాజ్యమునకు వచ్చి దక్కనున చాల బలవంతుడుగా నుండెను. ఈతని కాలమున ఆంధ్రదేశమున బౌద్ధము అత్యున్నతి నొందినది. ఈతడును దక్షిణాపథ చక్రవర్తిగా పరిగణన పొందెను. శాసనములు రాజకుటుంబస్త్రీలు బౌద్ధమతమునకు చూపిన వదాన్యతను పేర్కొనుచున్నవి.

ఇక్ష్వాకుల శాసనములు దక్కను అంతటాలేవు. ఇక్ష్వాకుల సామ్రాజ్యము తూర్పు దక్కనులో పెన్న లేక పినాకినీ నదినుండి ఉత్తరమున మేకలపర్వతముల వరకు వ్యాపించి యుండెను. దాని ఎల్లలు ఉత్తరమున మహాక్షాత్రవులరాజ్యము, వాయవ్యమున ఆభీరరాజ్యము, పశ్చిమమున ఆంధ్రభృత్యుల రాజ్యములు లేక ఉజ్జయినీ, త్రికూట, వనవాసి రాజ్యములు. ఇతని కాలములో శాంతిపరిస్థితులవలన ఆంధ్రదేశము, పరిసరప్రాంతములు వైభవోపేతములై యుండెను. ఈతడు తన తండ్రి ఇచ్చిన సామ్రాజ్యము చెక్కుచెదరకుండ కాపాడెను, బౌద్ధప్రాభవమువలన ఆంధ్రదేశముల చాల ప్రతిష్ఠనొందెను. పరిసరరాజ్యములతో సంబంధ, బాంధవ్యములను కల్పించుకుని తన సామ్రాజ్యప్రభావమును ఆ రాజు నిలిపెను. ఈతడు ఉజ్జయినీ రాకుమార్తె మహాదేవి రుద్రభట్టారికను పెండ్లాడెను; తనకుమార్తె కొడబలిశ్రీ (కుందవల్లిశ్రీ)ని వనవాసి రాజుకిచ్చెను. ఇతడు ధర్మమహారాజాధిరాజు. శివస్కంధ వర్మ కాదంబుడు, వైజయింతీ పురాధీశ్వరుడు, అభీరుల భయముచే ఉజ్జయినీ మహాక్షాత్రవులు ఆంధ్రదేశముతో సఖ్యముగా నుండిరి ఈతని మామ అయిన మొదటి రుద్రసేనుడు, అతని సోదరులు సంఘదమనుడు (క్రీ. శ. 222-3), దామసేనుడు (క్రీ. శ. 223-36) అతని సమకాలికులు. దామసేనుని చివరి రోజులలో ఆభీర ఈశ్వర దత్తుడు కొంతకాలము ఉజ్జయినినాక్రమించి మహాక్షాత్రప బిరుదు వహించెను. తన సామ్రాజ్య పటిష్ఠతకై, వీరపురుషదత్తుడు ప్రబలులైన సామంతులతో సంబంధములు కలుపుకొనెను. తన సోదరిని మహాదండ నాయక స్కంద విశాఖనాగున కిచ్చి, తాను తన అత్తల కుమార్తె హమ్మశ్రీ, చాంతి శ్రీలను పెండ్లియాడెను. ఈమేనత్తలు మహాసేనాపతుల భార్యలు. తరువాత రాజవంశములైన కేకయులు, చోళులు తమకు ఇక్ష్వాకులతో రక్తసంబంధమున్నదని చెప్పుకొనిరి.

శాసనముల ప్రకారము శ్రీవీరపురుషదత్తుని భార్యలైదుగురు. పట్టపుదేవి, వాశిష్ఠి రాకుమార్తె భట్టిదేవి. ఈమె బాహుబల శాంతమూలుని జనని. కొడబలిశ్రీకి కూడ జననియై యుండవచ్చును. మరొక రాణి మహాదేవి రుద్రధరభట్టారిక. మిగిలినవారతని అత్త కుమార్తెలు. ఈ జ్ఞాతివివాహములు అచారములోనున్న మేనరికముకన్న గర్హణీయములు. అయినను రాజకీయకారణములవలన ఈ వివాహములు జరిగెను. శాసనములలో చాలమంది రాజబంధువులపేర్లుకూడ కలవు.

శాసనములు మూడవ శతాబ్దములోని రాజకీయపరిస్థితులు చెప్పకపోయినా, ఇక్ష్వాకుల ఆదరణలో బౌద్ధమతాభివృద్ధిని వివరించుచున్నవి. ఇవి బౌద్ధక్షేత్రమయిన శ్రీపర్వతమును, విజయపురిని పేర్కొనుచున్నవి. చాల బౌద్ధ చైత్య, విహారములు సింహళము, మలయ ద్వీపకల్పము, చైనా, తూర్పుద్వీపమువంటి సుదూర ప్రాంతములనుండి విద్యార్థులుగా వచ్చిన బౌద్ధభిక్షులతో ఎల్లప్పుడు నిండియుండెను. ఆంధ్రదేశమున చాల బౌద్ధ సంప్రదాయములు రాజ కుటుంబములలో విలసిల్లు చుండెను.

కాని ఆశ్చర్యకరమైన విషయము ఇక్ష్వాకురాజులెవ్వరూ బౌద్ధులకు దానధర్మములు చేయలేదు రాజవంశీకులైన, బంధువులైన స్త్రీలేచేసిరి. దీనివలన ఇక్ష్వాకులు బ్రాహ్మణులైనను తమస్త్రీలను బౌద్ధము నవలంబించనిచ్చిరని అభిప్రాయము ఏర్పడును కాని శాంతమూలుని వారసులు బౌద్ధులై రాజవంశస్త్రీలు బౌద్ధమునకు చేసిన ఏర్పాట్లు చక్కగా నిర్వహించియుండవచ్చును కూడా. శాసనములు శ్రీ వీరపురుషదత్తుడు బ్రాహ్మణుడని, మాహేశ్వరుడని తెలియచేయుచున్నవి కాని అనతికాలములో బౌద్ధముచే ప్రభావితుడాయెను. ఇది ఆతని ఆరవ రాజ్య సంవత్సరమున జరిగియుండవచ్చును. పదహారు నాగార్జునకొండ శాసనములాకాలమునాటివి శ్రీపర్వత మహాచైత్య పునరుద్ధణను తెలుపుచున్నవి. చాల గుహావిహారముల, చైత్య గృహముల, చతుశ్శాలల, మంటపముల నిర్మాణము జరిగెననికూడ చెప్పుచున్నవి. శ్రీవీరపురుషదత్తుని అత్త ఈ మహాచైత్యమును పునరుద్ధరించి, తన అల్లునికి బౌద్ధముపై ఆసక్తి కలిగించెను. ఈపునరుద్ధరణ విజయపురిలో అపరసేలీయాచార్యుల కొరకు జరిగెను. పునరుద్ధరణ మహోత్సవమునకు రాజకుటుంబమంతయు విచ్చేయుట దాని ప్రాముఖ్యమును చాటును. బౌద్ధశిల్పములుకూడా శ్రీవీరపురుషదత్తుని బౌద్ధాభినివేశమును చాటుచున్నవి. ఒక రాజు బహుఫణి పరివేష్టిత లింగమును పాదఘట్టన చేయుచున్నట్లు శిల్పముకలదు. శ్రీవీరపురుషదత్తుడు లింగపూజారి. ఈ శిల్ప

సంకేతము శైవ బ్రాహ్మణమునకు చెందినది. ప్రధానమంత్రి సర్వసేనానిమున్నగు ఉద్యోగులు, ఛత్రముపట్టు సేవకులు మున్నగువారు రాజును పరివేష్టించిరి. దీనివలన ఈతడు అశోకునికి ప్రతిగా ప్రతీతి నొందెను. మరొక శిల్పము ఆతడు బుద్ధుని ప్రహరింప బోవునట్లు, అత్తలాతని నివారించినట్లు, చివరకాతడు బుద్ధునకు వినమ్రుడైనట్లు చూపును. మరొకటి భట్టిశ్రీ ఆమె సంతానము, ఆతడు బౌద్ధుడగుట చూచుచున్నట్లుండెను. భట్టిశ్రీ తన పుత్రుని రాజ్యకాలమువరకు బౌద్ధమును స్వీకరించి ఆదరించలేదని తోచుచున్నది. శ్రీవీరపురుషదత్తుని మార్పు ప్రజారంజకముగానున్నట్లుకూడతోచును మరొకశిల్పమాతని రాజ్యత్యాగమును, భిక్షువుగా బుద్ధగయ యాత్ర సూచించును. ఇట్లు ఆతని ముఖ్యజీవిత విశేషములు తెలియుచున్నవి.

బౌద్ధమును ఆదరించిన వారిలో ముఖ్యవ్యక్తి శ్రీవీరపురుష దత్తుని అత్త రాకుమార్తె మహాతలవరి, మహాసేనాపత్ని, మహాదండపత్నిశాంతిశ్రీ. ఆయిరహంగ (ఆర్యసంఘ) ఆచార్యులు, దీర్ఘ, మజ్ఝిమ (దీర్ఘ, మధ్యమ) నికాయ పండితులు, భిక్షుశిల్పులు, పమ్నగామ (గ్రామ) వాసులైన ఆచార్యులు భదంత, ఆనందులు బౌద్ధమహాచైత్య నిర్మాణమును పర్యవేక్షించిరి. మహాదేవి రుద్రధర భట్టారిక ఉజ్జని (ఉజ్జయిని) రాకుమార్తె కూడ ద్రవ్యసహాయముచేసెను. శాంతిశ్రీ ఒక శిలా మంటపమును అపరమహావినసేలియ లేక అవరసేలియుల ఆచార్యుల కొరకు నిర్మించెను. కొన్నిదానములు శ్రీవీరపురుషదత్తుని 'ఆయుర్వర్ధికై విజయమునకై' అని చెప్పుటచే ఆ కాలములో, క్రీ. శ. 232 ప్రాంతములో, అతడు శత్రువులతో దీర్ఘ యుద్ధముననున్నట్లుతోచును. ఈమె అపరమహావినసేలియ అని తోచును. ఆమె తరువాత బౌద్ధము నాదరించిన ఇతరులు: మహాతలవరి అడవిచాంతిసిరి (శాంతిశ్రీ) ఈమె శాంతమూలుని కుమార్తె. మహాసేనాపత్ని చూలచాంతి సిరినిక (క్షుద్ర శాంతి శ్రీనాగ), ఈమె కులహకరాకుమార్తె. మహాసేనాపతి వాశిష్ఠీపుత్ర స్కంద చలికిరినకుని (హిరణ్యక వంశీయుడు) భార్య. మహాదేవి బాపిశ్రీ, మహాదేవి చతిసిరినిక (షష్టిశ్రీ), రాకుమార్తెహమ్మశ్రీ పుత్రికలు, శ్రీవీరపురుషదత్తుని భార్యలు. మరొకామె మహాతలవరి పూగీయశాంతిశ్రీ సవతి, మహాసేనాపతి, మహాతలవర విష్ణుశ్రీజనని. ఇట్లు వీరందరును శాంతిశ్రీననుసరించిరి. మరొకవ్యక్తి ఉపాసికబోధిశ్రీ. ఈమె రాజబంధువు కూడ కాదు. కోశాధ్యక్షుడు భదుని (భద్రుని) మేనకోడలు. మరొకామె మేనమామపేరు బోధిసమ్మ (శర్మ) అనుటచే ఈమె బ్రాహ్మణి. శ్రీవీరపురుషదత్తుని ఆరవరాజ్యకాల శాసనములలో ఇఖాకు(ఇక్ష్వాకు)రాజు బౌద్ధమత

చైతన్యమునుచూచినట్లు ప్రోత్సహించినట్లు సూచించుట ఆతడా సంవత్సరముననే బౌద్ధుడైనట్లుతోచును

### 3. వాశిష్ఠీపుత్ర శ్రీబాహుబల శాంతమూలుడు (క్రి. శ. 239-252 ప్రాంతము) ఇక్ష్వాకుల క్షీణత, పతనము :

శ్రీపురుషదత్తుని రాజ్యత్యాగానంతరము అతని కుమారుడు వాశిష్ఠీపుత్ర శ్రీబాహుబల శాంతిమూలుడు సింహాసనమధిష్ఠించెను. మహాదేవి వాశిష్ఠి శ్రీభట్టిదేవి ఇతని జనని. ఇక్ష్వాకు సామ్రాట్టులలో ఇతడాఖరువాడై ఉండవచ్చును. ఆతని స్మారకస్తంభ శాసనము శ్రీహరపురుషదత్తుడు 238-9 సంవత్సరమున రాజ్యత్యాగముచేసినట్లు చెప్పుచున్నది. ఇదే సమయమున పల్లవరాజు వీరకూర్చవర్మ, వైజయంతిరాజు మానవ్యగోత్రుడు, కదంబుడు అయిన శివస్కందవర్మను, అతని మిత్రులను నిర్జించి వైజయంతి నాక్రమించి నట్లగపడును. శ్రీవీరపురుషదత్తుడు దక్షిణమున తనసైన్యము లోడుటచే యౌవనుడైన తన కుమారునికి రాజ్యము వదలివేసి యుండవచ్చును. ఇది సహజ వైరాగ్యమునకు తోడై ఉండవచ్చును.

శ్రీవీరపురుష దత్తుని చివరి నాల్గు సంవత్సరములు సంఘటనాత్మకములు. అతని అత్త పూశాయిశాంతిశ్రీ అతని విజయమున కారాటపడెను. ఈకాలములో వీరకూర్చవర్మ ఇక్ష్వాకు కదంబసైన్యముల నోడించియుండవచ్చును. బాహుబలుడు రాజ్యమునకు వచ్చునాటి కిది పరిస్థితి. ఆతని రాజ్యారంభమున కదంబుల పరిస్థితి మెరుగుపడెను. చివరకాతడు పల్లవుల జయించి వైజయంతిని తీసుకొనెను. బాహుబలుడీతనికి సహాయపడి యుండవచ్చును.

శిల్పములు, రాజకీయ సంఘటనలు బాహుబలుడు తన యౌవనారంభమున రాజ్యమునకు వచ్చినట్లు సూచించును. తాతపేరు మనుమనికిడు ఆచారము ఇక్ష్వాకుల నాటినుండియే ఆంధ్రమున ఆరంభమై యుండవచ్చును. గుప్తులు, వాకాటకులు, పల్లవులు, విష్ణుకుండినులు, సాలంకాయనులు దీనిని పాటించిరి. మహాభాష్యము, దాని వ్యాఖ్యయు దాని నుటంకించుటచే ఇది శాస్త్రసమ్మతముకూడ.

బాహుబలుని పరిపాలన కాలమునాటివి రెండు శాసనములే ఉన్నవి. అవి రాజకీయ పరిస్థితులను తెలియచేయవు. బహుశ్రుతీయ, మహీశాసక అను మరిరెండు బౌద్ధశాఖ లున్నట్లవి చెప్పును. మొదటి శాసన మాతని రెండవరాజ్య సంవత్సరము నాటిది, ఇది మహాదేవి వాశిష్ఠిభట్టిదేవి కొన్ని బౌద్ధకట్టడములను

నిర్మింపించినట్లు చెప్పును. రెండవశాసనము మహాదేవి కొడబలిశ్రీ నిర్మింపించిన కట్టడములను గురించి తెలుపును. ఆమె తన అన్నను, తండ్రి తాతలను, భర్తను పేర్కొనెను. వీని నిర్మాణము థీర (స్థవిర) ధర్మఘోషుని (మహిశాసకుడు) అధ్వర్యములో జరిగెను. ఇది బాహుబలుని పదునొకండవ రాజ్యసంవత్సరమున జరిగెను. ఈమె తనభర్తను వనవాసక అనియే చెప్పెను. తాత, తండ్రి, అన్నల పేర్లు చెప్పెను. ఆది ఆమె తన వంశమును గౌరవించుటను, అది దక్షిణాపథమున ఆధిక్యతలో నున్నట్లును సూచించును తన భర్త ఆంధ్రచక్రవర్తుల రక్షణలో నుండెను. అతనిది చూటుకులశాతకర్ణి అను నాగజాతి వంశము. సాతవాహన సామ్రాట్టుల వంశశాఖ, వనవాని చూటువంశము చాల తక్కువకాలము పాలించెను. ఇతడు చూటు, కదంబ నంశముల కలయిక వలన జన్మించెను. పేరు శివస్కంద వర్మ.

బాహుబలుని చివరి కాలములో ఇక్ష్వాకులు త్వరగా క్షీణించనారంభించిరి. అతను మరణించిన వెంటనే ఇక్ష్వాకు లంతరించిరి. చూటు శాతకర్ణులు వారసులు లేక అంతరించిరి. వారితోపాటు ఉజ్జయిని మహాక్షాత్రపులు కూడ అంతరించిరి. ఇది మూడవ శతాబ్ది మధ్యకాలమున జరిగెను. ఐకమత్యముతో నున్న ఈ చూటు వంశము క్షీణించుటచే ఉత్తరమున ఆభీరులు, దక్షిణమున పల్లవులు విజృంభించిరి. ధనసేనుని మరణానంతరము వనవాస రాజ్యముకొరకై వారసులలో కలహము లారంభమాయెను. కదంబులకు ఇక్ష్వాకులకు సంబంధ బాంధవ్యములు కలవు. పల్లవ వీరకూర్చవర్మ వైజయంతి నాక్రమించుకొనెను. పల్లవులు ఇక్ష్వాకుల ఆధిక్యమును నశింపజేయ సమకట్టిరి. అట్లే ఆభీరు లుజ్జయిని నాక్రమించిరి. ఆభీరుల ఆక్రమణ, పల్లవుల ఉన్నతి ఇక్ష్వాకు, కదంబ, మహాక్షాత్రప సమాఖ్యను పడగొట్టినవి.

మహాక్షాత్రపుల క్షీణత ఇక్ష్వాకులను క్రమేపీ బలహీనుల చేసెను. కదంబ శివస్కందవర్మ మృతి తరువాతి సంఘటనలు ఇక్ష్వాకుల పతనమును త్వరితము చేసినవి. చివరకు కాంచీపల్లవులు దండెత్తి వచ్చి ఇక్ష్వాకుల ప్రాబల్యము నంత మొందించిరి. ఇట్లు మూడవ శతాబ్ది మధ్యభాగమున ఆంధ్రసామ్రాట్టుల వారసులైన ఇక్ష్వాకులు, ఆంధ్రభృత్యులు అంతమొందిరి. ఆంధ్రదేశమున ఇక్ష్వాకుల నాశనమునకు మరొకకారణము విస్మృతులైన ఆంధ్రసామ్రాట్టుల వారసులు వారిపై పగబూని పల్లవులకు సహాయపడుట అయి ఉండవచ్చును. మరొక కారణము

శ్రీవీరపురుషదత్తుని, బాహుబలుని బౌద్ధమతా సక్తి. దానితో బ్రాహ్మణులు. వీర బ్రాహ్మణులైన పల్లవులతోచేరి బౌద్ధముపై, దానిని అతిగా ఆదరించిన ఇక్ష్వాకులపై ఇట్లు పగతీర్చుకొనిరి. ఇక్ష్వాకులతోపాటు ఆంధ్రమున బౌద్ధప్రాభవ మంతరించెను. బ్రాహ్మణ ప్రాభవ మారంభమాయెను. ఇట్లు నాల్గు శతాబ్దము లాంధ్రమున విలసిల్లి, ఆంధ్రమునకు విశ్వఖ్యాతి తెచ్చిన బౌద్ధమంతరించినది. పల్లవులు దక్షిణాంధ్రమును మాత్రమే కృష్ణానది వరకు ఆక్రమించుకొనిరి. ఉత్తరాంధ్రము సుమారు మరి నాల్గు శతాబ్దములు ఇక్ష్వాకు సామంతులైన బృహత్పలాయనుల, ఆనందుల, సాలంకాయనుల, విష్ణుకుండినుల పరిపాలన క్రింద నుండెను. వారును బ్రాహ్మణులే. బౌద్ధమునకు అంతట సరిఅయిన ఆదరణ లేక, అది ఆంధ్రమున నశించినది. ఇక్ష్వాకుల సింహపతాక ప్రాభవముతోపాటు శాక్యసింహుని ప్రాభవము కూడ ఆంధ్రమున అంతరించెను.

ఇక్ష్వాకుల సీసపునాణెములు కొన్ని శ్రీవీరపురుష దత్తుని కాలము నాటివి దొరికినవి. అవి వారు సాతవాహనుల సింహలాంఛనమునే కొనసాగించినట్లు సూచించును. వారు స్వర్ణ, సీసమిశ్రమ నాణెములు ముద్రించినట్లు తోచును. విష్ణుకుండినులు, పూర్వచోళులు, చోళులు కూడా ఈసింహలాంఛనమును కొనసాగించిరి. కృష్ణా, మూసీనదుల మధ్యదేశమునకు చోళవాడి అను పేరుండుటచేత, చోళులు కూడా ఇక్ష్వాకులను తమ పూర్వీకులుగా పేర్కొనుటచే, వారాంధ్రమున ఇక్ష్వాకులకు సామంతులుగా బంధువులుగా నుండి తరువాత దక్షిణమునకు, కావేరీతీరమునకు తరలిపోయినట్లు తోచును.

ఇట్లు ఇక్ష్వాకులు సాతవాహనుల అనంతరము అర్ధశతాబ్దము వరకు ఆంధ్రమున సాతవాహనులకు అన్నివిధముల వారసులై నడిచి, ఆంధ్రమును అన్ని రంగములలోను విలసిల్లునట్లుచేసి దాని కొక వ్యక్తిత్వమును సంతరించిరి. వారు దక్షణాపథమున మిగత రాజవంశములను తమ ప్రాభవములోనికి దెచ్చికొని, దానిని వారితో సంబంధ బాంధవ్యముచే పటిష్ఠముచేసి, ఆంధ్రమునకు దక్షిణాపథ సార్వభౌమత్వమును కూడ మొదటిసారిగా సంపాదించిరి. తరువాత ఆంధ్రము కొంతవ్యక్తిత్వము నొందినను, పూర్వమువలె దక్షిణాపథమున సార్వభౌమత్వము నొందలేకపోయెను. మరల అది సామ్రాజ్యాంతర్భాగమే అయ్యెను. లేదా ఆంధ్ర రాజ్యమే అయ్యెను. ఇది తరువాత విజయనగర సామ్రాజ్య, కాకతీయ సామ్రాజ్య, రెడ్డిరాజ్యముల దృష్ట్యా ఏర్పడు భావము. ఆంధ్రమునకు మొదట, చివరిసారిగా వ్యక్తిత్వమును, సార్వభౌమత్వమును సంతరించుటే ఇక్ష్వాకుల విశిష్టత.

# 3. బృహత్ఫలాయనులు

## 1. కోదూర లేక కాదూర బృహత్ఫలాయనులు, జయవర్మ (క్రీ. శ. 270-285 ప్రాంతము).

ఆంధ్రదేశమును, పరిసరప్రాంతములను తమ సార్వభౌమాధికారము క్రిందికి తెచ్చిన ఇక్ష్వాకుల పతనానంతరము వారి సామ్రాజ్యము, చిన్న స్వతంత్రరాజ్యములుగా చీలిపోయెను. వారి సామంతులు కొందరు సార్వభౌమాధికారమును పొందిరి. పల్లవులు ఇక్ష్వాకులను కూలద్రోసి దక్షిణాంధ్రము నాక్రమించుకొన్న తరుణమున, అధికారమునకు వచ్చినట్టి సామంతులు బృహత్ఫలాయనులు, ఆనందులు. వారిలో మొదటివారు బృహత్ఫలాయనులని తోచును.

బృహత్ఫలాయనుల ఏకైక శాసనము (కొండముది) ప్రకారము మహారాజు జయవర్మ తన్ను మహేశ్వరపాద పరిగృహీతునిగా పిల్చుకొనెను. ఇది తన రాజధాని కోదూర విజయ స్కంధావారము నుండి అతడు యుద్ధానంతర మొసగిన బ్రాహ్మణాగ్రహారదాన శాసనము. ఇది ఆతని పదవ రాజ్యకాలము నాటిది. ఈ శాసనలిపి పల్లవలిపిని పోలియుండుటచే జయవర్మ, మొదటి శివస్కందవర్మకును అతని చివరి కాలములో అతని పుత్రుడు మొదటి విజయబుద్ధ వర్మకును సమకాలికుడని తోచును. అతడు శివస్కందవర్మ మరణించగనే అతని పుత్రు నోడించి దక్షిణాంధ్రమునుండి పారద్రోలినట్లు తోచును. జయవర్మ, విజయబుద్ధవర్మ పుత్రుడు బుధ్యంకురునికి కూడ సమకాలికుడు. ఈతని కాలమున బృహత్ఫలాయనులు ప్రాభవము నొందిరి. చివరకు జయవర్మ పల్లవులకోడి నిహతుడయ్యెను. అప్పటి పల్లవరాజు బుధ్యంకురుడుగాని, ఆతని పినతండ్రి గాని, ముఖ్యముగా రెండవ విజయస్కంద వర్మగాని అయి యుండవచ్చును. జయవర్మ రాజధానియగు కోదూరు, ఘంటసాల వద్ద నున్నది.

బృహత్ఫలాయనులు ఆంధ్రతీరమును సంరక్షించుటకు సముద్రతీరమున నున్న కోదూరును రాజధానిగాచేసికొని యుండవచ్చును. ఇచ్చటినుండి వర్తక వ్యాపారములు, బౌద్ధభిక్షువుల సముద్రాంతరదేశ నిర్గమనము జరుగుచుండెను. కృష్ణాప్రవాహముల మార్పులచే కోదూరు క్రమేపీ సముద్రతీరమునకు దూరమైనది.

బృహత్ఫలాయనులు రెండవ వాశిష్ఠీపుత్ర శ్రీ పులుమావి చక్రవర్తి కాలము నుండి ఉన్నట్లు తోచును. వారి నాతడు తీరప్రాంత రక్షణకు ఈప్రదేశమున నియోగించి యుండవచ్చును. ఇట్లు వారాంధ్రసామ్రాట్టుల సామంతులు. తరువాత ఇక్ష్వాకులకు సామంతులై ఆప్రాంతముననే ఉండిరి. వారిలో జయవర్మ చివరివాడు, సార్వభౌమాధికారమును పొందినవాడును అయి మూడవశతాబ్ది చతుర్థపాదమున విలసిల్లియుండ వచ్చును

గ్రీకు భౌగోళికుడు టోలెమీకథనము ప్రకారము, మైసోలియిస్ అనునది యీ (కృష్ణా) తైనా (పెన్న) నదుల మధ్యప్రదేశము ఆంధ్రసామ్రాజ్యమున గొప్ప సముద్రతీర రాష్ట్రమని తోచును.

ఇక్ష్వాకుల పతనానంతరము బృహత్ఫలాయను లుత్తరాంధ్రము నాక్రమించి నట్లుతోచును వారు ఇక్ష్వాకుల కాలముననే బలవంతులై సుదీర్ఘమైన తూర్పు ఆంధ్ర దేశతీరమును సామంతులుగా పాలించుచుండిరి. అందుచే వారు సులువుగా ఇక్ష్వాకుల స్థానమునకువచ్చి ఆంధ్రరాజ్యైక్యతను కాపాడిరి శివస్కందవర్మమృతి, అతని బల హీనులైన వారసులు–జయవర్మకు సార్వభౌమత్వమును పొందు అవకాశము కలి గించిరి. ఇది క్రీ. శ. 275 ప్రాంతమున జరిగియుండవచ్చును. జయవర్మ పది సంవత్సరములవరకు పల్లవులతాకిడికి నిలువకలిగెను. పల్లవులు కృష్ణదాటి పోవలసి వచ్చెను. కాని జయవర్మ మరణానంతరము తిరిగి దక్షిణాంధ్రమును వారు ఆక్ర మించిరి. ఈ ప్రయత్నములలో వీరవర్మ మృతినొందెను. జయవర్మ మరణా నంతరము బృహత్ఫలాయములు విస్మృతి నొందిరి. జయవర్మ పూర్వీకులు, వార సులు ఎవరో తెలియదు. ఇట్లతని చరిత్రయే బృహత్ఫలాయనులచరిత్ర. ఆత డాంధ్రము చీలిపోకుండరక్షించెను. అతనిఉద్యోగి భోపహావనవర్మ. అతని బిరుదులు, మహాసేనాపతి, మహాతగవర, మహాదండనాయక, అనునవి, అతడు ఇక్ష్వాకుల స్థానము నాక్రమించ ప్రయత్నించినట్లు సూచించును. బృహత్ఫలాయనులు, వెంటనే ఇక్ష్వాకు సామ్రాజ్యమునకు వారసులైరని కూడ అది సూచించును. జయివర్మ తన తాత్కాలిక ప్రాభవము తరువాత క్రీ. శ. 285 ప్రాంతమున యుద్ధరంగమున మృతినొంది యుండవచ్చును. అతనితో బృహత్ఫలాయన వంశమంతరించెను. టోలెమీ 'పిటుండా' అనునది మైసోలియా రాజధాని అని చెప్పుటచేతను, ఖారవేలుని హాథిగుంఫ శాసనము దానిని పేర్కొనుటచేతను, బృహత్ఫలాయనులు పిటుండా రాజధానిగా కృష్ణా ముఖద్వార ప్రాంతమున ఖారవేలుని కాలమునుండి పాలకులుగా నున్నట్లుగా ఊహించవచ్చును.

# 4. కందరపురి ఆనందరాజులు

## (క్రీ. శ. 290-630 ప్రాంతము)

ఆంధ్రదేశమున జరిగిన రాజకీయ ప్రాబల్యపు పోరాటములో బృహత్ఫలాయనుల తరువాత లెక్కింపదగినవారు ఆనందగోత్రులైన కందరపుర రాజులు. శాసనములు ఆనంద లేక ఆనంద మహర్షి అను వ్యక్తిని పేర్కొన్నవి. నాగార్జునకొండ శాసనములలో భదంత ఆచార్య అనందునిపేరు కలదు. ఈతడు బృహత్ఫలాయనుల పతనానంతరము కూడ జీవించియుండి కందరపురరాజులను, ఇక్ష్వాకులు స్థాపించిన రాజ్యప్రతిష్ఠను పునరుద్ధరించి పల్లవులపై పగతీర్చుకొనమని ప్రోత్సహించి యుండవచ్చును. మొదటి కందరుని ప్రాబల్యకాలము ఆచార్య ఆనందునికాలమునకు దగ్గరగుటచే ఇది సమంజసమని తోచును. మొదటి ఆనందవంశ సార్వభౌముడు తాను బుద్ధభక్తుడనని, ఆనంద గోత్రుడనని చెప్పుకొనెను. ఇత డిక్ష్వాకులు పాలించినంత రాజ్యమును పాలించెను. ఇటుల ఒక పుణ్యాత్ముడైన బౌద్ధభిక్షువు దేశభక్తితోను, ఇక్ష్వాకులయందభిమానముతోను ఒక సామంతరాజవంశపు శౌర్యమును ప్రేరేపించి వారు తమ దేశప్రాభవమును పునరుద్ధరించునట్లు చేసెను.

మొదటి కందరుని చేజెర్ల శాసనము అతని లాంఛనము గోలాంగూలమని చెప్పెను. కందరుల ప్రథమశాసనమైన దామోదరవర్మయొక్క మట్టిపాడుశాసనము, వారి గోత్రము ఆనంద అని మాత్రమేచెప్పెను. ఈ శాసనము నాల్గవశతాబ్దపు చతుర్థపాదమునకు చెందును. వారిని వారి సమకాలికులు గోలాంగూలులని పిల్చియుండవచ్చును. మార్కండేయ పురాణము భారతవర్షము కూర్మముగా ఊహించి దాని ఈశాన్యపాదములో ఆనందులున్నట్లు చెప్పెను, వారు కృష్ణానది దిగువభాగమున ఉండిన పూర్వపు ఆంధ్రదేశమున ప్రబలిన నావికజాతి అని తోచును.

ఆనందుల శాసనములు మూడుకలవు. అందు రెండు మట్టిపాడు, గోరంట్ల తామ్రశాసనములు. మూడవది చేజెర్ల కపోతేశ్వరాలయములోని శిలాస్తంభశాసనము. ఇది చివరి శాసనము. మట్టిపాడు శాసనము మొదటిది. ఇది పాకృత సంస్కృత మిశ్రమము, సంస్కృతము ప్రాకృతమును వెనుకకు త్రోసినా, పేర్లింకను ప్రాకృతములోనే ఉండెను. ఇట్టిది ప్రాకృత, సంస్కృతముల సంధికాలము, నాల్గవ

శతాబ్దపు మొదటిభాగము. అందుచే జయవర్మ వెనువెంటనే దామోదరవర్మ, అధికార ములోనికి వచ్చియుండును. అత్రివర్మ గోరంట్ల శాసనములో అతనిపేరు తప్ప, మిగిలినవి సంస్కృతములోనే ఉన్నవి. అత్రి (హస్తి) వర్మ కాలములో ఆనందులు బౌద్ధులు కానట్లు తోచును. ఈతడు వంకేశ్వర శివభక్తుడు.

ఆనందుల శాసనములు వారిని హిరణ్యగర్భులని పిలుచుచున్నవి. మట్టె పాడు శాసనము దామోదరవర్మను 'అవంధ్య గోసహస్ర అనేక హిరణ్యగర్భో, ద్భవస్య' అని పేర్కొన్నది. గోరంట్ల శాసనము అత్రివర్మను 'అప్రమేయ హిరణ్యగర్భ ప్రసవేన'అని పేర్కొనెను. ఆనందరాజులు మహాధనికులై హిరణ్య గర్భ మహాదానమునుచేసి ఉన్నత జన్మను పొందియుండ వచ్చును.

మట్టెపాడు శాసనము దానశాసనము. కంగూరగ్రామము దీనివలన బ్రహ్మ దేయము అయెను. హైందవమాసముల పేర్లను పేర్కొన్న ఆంధ్ర, దక్షిణ భారత శాసనములలో ఇది మొదటిది. ఇది దామోదరవర్మ పరమబౌద్ధుడని సూచించు చున్నది, ఆంధ్రనామములు రూపొందినతీరు, ఆంధ్రభాష ఉద్భవించి పెంపొందిన తీరు, అంధ్రనామములు రూపొందినతీరు ఇది సూచించుచున్నది. కాని కంగూర గ్రామము ఏ రాష్ట్రములో, ఏ విషయములో నున్నదో చెప్పలేదు.

కందరపురము ఆనందుల రాజధానిగా కన్పడుచున్నది. బౌద్ధులు దానిని కపోతకందరపురమని పేర్కొనిరి. అది ఇప్పటి చేజెర్ల అయి యుండవచ్చును. అచ్చటి కపోతేశ్వరాలయము మొదట ఒక బౌద్ధ చైత్యము.

అత్రివర్మ గోరంట్ల శాసనము కూడ తన్నికొన్న బ్రహ్మదేయ దానశాసనమే. చేజెర్లశాసనము ప్రాచీనాంధ్రలిపిలో నున్నది. ఇది ఏడవశతాబ్దికిచెందినట్లుతోచును. ఈమూడు శాసనముల కాలపరిమితి మూడు శతాబ్దములు; ఇది సుమారు నాల్గవ శతాబ్ది ప్రారంభమునుండి ఏడవశతాబ్ది ప్రథమపాదమువరకు ఉండును. మట్టెపాడు గోరంట్ల శాసనముల విరామకాలము ఒక శతాబ్దికాగా, గోరంట్ల, చేజేర్లశాసనముల మధ్యకాలము రెండు శతాబ్దులు. ఇట్లు ఆనందులు, దక్షిణాంధ్రముననున్న పల్లవులు సమకాలికులని తోచును. వారు బృహత్ఫలాయనుల వెనువెంటనే ప్రబలులైనను, ఈ సుదీర్ఘపు మూడుశతాబ్దముల కాలములో ఏనాడును చాలకాలమువరకు ప్రాబల్య ములో నున్నట్లు తోచదు.

ఆనందులలో ఇంతవరకు తెలిసిన మొదటి సార్వభౌమాధికారముగల రాజు

దామోదరవర్మ. ఆతని పూర్వీకులు ఇక్ష్వాకుల సామంతులై ఉండియుందురు. కాని అతని పూర్వపురాజు కొంత స్వతంత్రాధికారము కలిగియుండెను. బృహత్ఫలాయనుడగు జయవర్మ మరణానంతరము అతడు ప్రబలుడై పల్లవులతో పోరాడి స్వతంత్రుడయ్యెను. అతనిని మట్టెపాడు శాసనము స్మరించకపోవుట ఆతడు దామోదరవర్మ తండ్రికాడని తెలియచేయుచున్నది. ఆతని నామము కందరరాజు లేక నృపతి అయి యుండవచ్చును. గోరంట్లశాసనము అత్రివర్మ అతని కుటుంబములో జనించినట్లు జెప్పుచున్నది. కందరపురమును అతనిపేర అట్లు పిలిచియుండవచ్చును. అందుచేత అతనిని వంశస్థాపకునిగా ఊహించవచ్చును. ఆతనిని శాసనములు రెండుసార్లు పేర్కొనుచున్నవి. మొదటి కందరరాజు, దామోదరవర్మ బలవంతులుగా నగుపింతురు. దామోదరవర్మ రాజ్యారంభము నాటికి ఆనందుల రాజ్యము ప్రాభవముతో నుండెను. మట్టెపాడు శాసనము దామోదరవర్మను పేర్కొనుచు, హిరణ్యగర్భము, అవంధ్య గోసహస్రము మున్నగు మహాదానములు చేసినట్లు పేర్కొనెను. ఇది అతని రెండవ రాజ్యసంవత్సరకాలమున. దామోదరవర్మ అట్లు బలమైనరాజ్యమునకు వారసుడై శాంతి, ఐశ్వర్యములనుచేకూర్చి, అనేక క్రతువుల నాచరించెను. పల్లవరాజ్యకాలము ప్రకార మీతడు బుధ్యంకుర, రెండవ విజయవర్మల సమకాలికుడు. అందుచే ఆతని రాజ్యకాలము,కుంతలపాలకుడు కదంబ మయూరశర్మతో (క్రీ. శ. 300-40 ప్రాంతము) కూడ సమకాలికము. ఈతని రాజ్యారంభమున బుధ్యంకురుడు ఓడి మృతుడైనట్లు తోచును. ఈతని రాజ్యాంతము నాటికి ఉత్తరాంధ్రమున వేంగిలో సాలంకాయన వంశపు విజయదేవవర్మ నాయకత్వము బలవంత మయ్యెను. ఆతడశ్వమేధముకూడ చేసెను. అతడు ఆనందులను కూలద్రోసి ప్రబలుడైనట్లు తోచును. దామోదరవర్మ వారసును ఆతడు నిర్జించి తూర్పురాష్ట్రముల నాక్రమించుకొని యుండును. ఇంతేకాక, ఈసమయముననే పల్లవ రెండవ విజయస్కంద వర్మకూడ ఆనందులను నిర్జించి కృష్ణాతీరమువరకు ఆక్రమించుకొని యుండును. దామోదరవర్మ రాజ్యకాల మిరువది సంవత్సరములై యుండవచ్చును (క్రీ. శ. 295-315 ప్రాంతము). అది పల్లవులగు బుధ్యంకుర (క్రీ. శ. 285-95 ప్రాంతము), రెండవ జయస్కందవర్మ (క్రీ. శ. 295-330 ప్రాంతము) రాజ్యకాలములతో సమకాలికమై యుండుటేకాక, పల్లవుల ప్రతిష్ఠ సన్నగిలి యుండిన కాలము.

ఇరువైపుల-వేంగిసాలంకాయనుల, పల్లవుల-తాకిడితో ఆనందులు అంతరించి

ఆంధ్రదేశపటిష్ఠత పూర్తిగా దెబ్బతినెను. సాలంకాయనుల రాజ్యాధికారమునకు పూర్వము ఉత్తర, వాయవ్య ఆంధ్రరాష్ట్రములు వాకాటక మొదటి ప్రవరసేనుని (క్రీ.శ. 270-330 ప్రాంతము) సామ్రాజ్యాంతర్భాగమై యుండవచ్చును. అతడును అశ్వమేధ మొనర్చి దక్షిణాపథ సార్వభౌమత్వమునొందెను. దాని వెనువెంటనే విజయ దేవవర్మ ఆంధ్రమున ప్రబలి ఆనందులను, కళింగ, పశ్చిమాంధ్రములలోని చిన్నరాజులను లోబర్చుకొని, సార్వభౌమత్వమునొంది, వాకాటకునివలె అశ్వమేధ మొనర్చినట్లగుపడును.

మట్టెపాడు శాసనమున వృషభ లాంఛనమున్నది. అత్రివర్మకాలమునాటికి ఋషి లాంఛనము (ఆనందమహర్షిది అయి యుండవచ్చును) వచ్చెను. ఆనందులకు త్రికూట పర్వత బెన్నానదీ స్వాములని బిరుదుండుటచే వారి రాజ్యము కృష్ణా తీరమున వ్యాపించి యుండవచ్చును. త్రికూటమిప్పటి కోటప్పకొండ అయి ఉండవచ్చును. దానికి త్రిమూర్తులపేర మూడు శిఖరములు కలవు. గోరంట్ల శాసన మాతనిని వంకేశ్వరభక్తుడని చెప్పుచున్నది. వంకేశ్వరాలయము కోటప్పకొండదగ్గర దుర్గివద్దనున్నది.

చేజెర్ల శాసనముప్రకారము ఆనందుల రాజ్యము రెండు జనపదములు లేక మండలములు విస్తరించియుండినది. ఈ శాసనము కందరరాజును రెండుజనపద ముల రాజ్యాధిపతి అని పేర్కొనెను. ఇవి కృష్ణ కిరువైపుల సముద్రమునుండి పర్వత శ్రేణి వరకు వ్యాపించియుండెను. కృష్ణకు మన్నేరుకుమధ్య ఈశాన్య, నైరుతి దిశలకు వ్యాపించిన కర్మరాష్ట్రము అందొకటై యుండవచ్చును. కృష్ణకు ఉత్తరమునున్న జపదమును విష్ణుకుండిన రెండవ విక్రమేంద్రవర్మ, నత్నపతి విషయమని పిల్చెను. కృష్ణకు ఏలూరువద్దనున్న తమ్మిలేరుకు మధ్యనున్న ప్రదేశమునకు షట్సహస్రవాని విషయము లేక ఆరువేలనాడు అని పేరుండెను. కృష్ణాగోదావరులమధ్య ప్రదేశము నకు వేంగీ విషయమను పేరుండెను. తగిన ఆధారములు లేకుండుటచే అనందుల రాజ్య విస్తీర్ణత సరిగా తెలియదు. స్థానికాధారములు, గాధలనుబట్టి అది కృష్ణ కిరువైపుల గుంటూరు, కృష్ణా, నల్గొండ, వరంగల్ జిల్లాలలో వ్యాపించియుండును.

శాసనసూచనలనుబట్టి రెండవరాజు అత్రివర్మ ఇరువైదు సంవత్సరములు (క్రీ.శ. 395-420 ప్రాంతము) పాలించియుండును. అతనిని గోరంట్ల శాసనము 'రాజు' అనియే పేర్కొనుచున్నది. అందుచేత అతడు బలవంతుకాడని తోచుచున్నది అతడు పల్లవ రెండవ విజయ స్కందవర్మకు సమకాలికుడు. అతడు అత్రివర్మవలన

నిహతుడై యుండవచ్చును. పశ్చిమమున అతని సమకాలికుడు కుంతలకకుత్థ్సవర్మ (క్రీ. శ. 390-415 ప్రాంతము). ఇట్లు పల్లవులు నాల్గవ శతాబ్ది చివరలోను, ఐదవ శతాబ్ది మొదటను అన్ని దిశల పీడితులయిరి. రెండవ విజయ విష్ణు గోపవర్మ, కదంబుల, ఆనందులధాటి కోర్వలేక మృతుడై యుండును. ఈతనితో రెండవ విజయ స్కందవర్మ వంశమంతమై, పల్లవులాంధ్రమున విస్మృతులయిరి.

ఆనందులు తమ సుదీర్ఘ రాజ్యకాలమగు మూడు శతాబ్దులలోను పలుతడవలు పల్లవులను పోద్రోలి సార్వభౌమత్వమును పొందయత్నించిరి. మొదటి ప్రయత్నము దామోదరవర్మకు పూర్వీకుడగువాని కాలమున నాల్గవ శతాబ్ది ఆరంభమున జరిగెను. దామోదరవర్మ వారసులు సాలంకాయనులకు, పల్లవులకు ఓటుపడిరి. రెండవ ప్రయత్నము అత్రివర్మకాలములో జరిగెను. అతడు పల్లవ మూడవస్కందవర్మ కాలములో పల్లవులను, సాలంకాయనులను లోబర్చుకొని, కప్పమునుగైకొనెను. బలపంతులైన ఇతర సామతులనుకూడ లొంగదీసి కప్పమునుగైకొనెను. అతని తరువాత వారు మరల బలహీనులైరి. ఏడవ శతాబ్దమున రెండవ కందరరాజు మూడవ ప్రయత్నము చేసెను. కాని పల్లవ మొదటి మహేంద్రవర్మ దానిని సాగనీయలేదు. అత్రివర్మ, సాలంకాయనుల పతనమొకే కాలమున జరిగెను. అత్రివర్మ విష్ణుకుండినులచే నిర్జితుడై యుండును. విష్ణుకుండినులు త్వరలో ప్రబలి ఆంధ్రమునంతను, పరిసర రాజ్యములను ఇక్ష్వాకుల అనంతరమున రెండు శతాబ్దుల తరువాత ఆక్రమించుకుని, ఆంధ్రమును తమక్రింద సంఘటితముచేయ సమకట్టిరి. విష్ణుకుండినులలో మొదటివాడు ఒకటవ మాధవవర్మ అతడశ్వమేధమును పదునొకండుసార్లుచేసి, ఆంధ్రమున, దక్షిణాపథమున సార్వభౌముడైనట్లు చెప్పుకొనెను. ఇట్లు అత్రివర్మ తరువాత ఆనందులు సామంతులై ఏడవ శతాబ్దారంభమువరకు ఉండిరి.

విష్ణుకుండిను లానందుల రాజ్యమున ప్రబలినట్లు తోచును. అత్రివర్మ వారి నరికట్ట లేకపోవుటేగాక వారి చేతిలో నశించెను. పల్లవప్రశస్తి అత్రివర్మకాలమున లేకున్నను, గోరంట్ల శాసనము పల్లవులపై ఆతని విజయములను చెప్పుచున్నది. 'సురగురు సదృశ బుద్ధిన' మొదలగు అతని బిరుదులు పల్లవుల ప్రభావమును చాటుచున్నవి. ఇతరబిరుదులు 'సమ్యక్ప్రజాపాలనోపార్జిత కీర్తన' 'ప్రతాపోపాంత సకలసామంత మండలేన' 'మహేంద్రసమ విక్రమేన' మున్నగునవి. ఇవి కూడ పల్లవబిరుదులను పోలియున్నవి.

అత్రివర్మ వారసులను గూర్చి ఏమియు తెలియదు. కాని ఆనందులు ఏడవ శతాబ్ది ప్రథమపాదము వరకుండిరి. వారు పల్లవులకో విష్ణుకుండినులకో సామంతులుగా నుండిరి. విష్ణుకుండిన మూడవ మాధవవర్మ మరణము తరువాత, ఆనందులు పల్లవ మొదటి మహేంద్రవర్మ లేక మహేంద్ర విక్రమవర్మచే నిర్జితులైరి. పల్లవులు మరల దక్షిణాంధ్రము నాక్రమించిరి. చేజెర్ల శాసనము, పల్లవులు బాదామి చాళుక్యులనుండి దక్షిణాంధ్రమును, మొదటి మహేంద్రవర్మ కాలమున గైకొనునాటిది.

క్రీ. శ. 611 ప్రాంతమున పశ్చిమచాళుక్య సత్యాశ్రయ రెండవ పులకేశి, మూడవ మాధవవర్మ నోడించి ఆంధ్రమును జయించెను. కొంతభాగము నాక్రమించి, మిగిలినదానికి తన సేనాని పృథ్వీదువ (ధృవ) రాజును రాజప్రతినిధిగా చేసెను. మొదటి మహేంద్రవర్మ తన రాజధానివద్దనే పులకేశిని ఓడించి, ఆంధ్రములో చాళుక్య రాజప్రతినిధికి, విష్ణుకుండిన మంచన భట్టారకునికి మధ్య కలహముల నదునుగా తీసికొని దక్షిణాంధ్రము నాక్రమించెను. ఆతని కోడిన సామంతులలో కందపురానందుడు ముఖ్యుడు. అతడును, ఆతనిపుత్రుడును పల్లవ సామంతులైరి. చేజెర్ల శాసనమీ కల్లోల పరిస్థితులను సూచించుచున్నది. ఆతడు పల్లవసామంతుడుగా చాళుక్య రాజప్రతినిధి నోడించినట్లు శాసనము చెప్పును యుద్ధము ధన కటకమువద్ద క్రీ.శ. 620 ప్రాంతమున జరిగెను. కాని ఈ విజయమునూ, పల్లవుల దక్షిణాంధ్రాక్రమణయు కొలదికాలమే ఉండెను. రెండవపులకేశి తనతమ్ముడు బిట్టిసార యువరాజును ఆంధ్రమున తమ అధికారము పునరుద్ధరించ పంపెను. ఇతని మరొకనామము విష్ణువర్ధన విషమసిద్ధి. తరువాత అతడు అంధ్రమున క్రీ. శ. 624 లో కుబ్జవిష్ణువర్ధనుడను పేరుతో తూర్పు చాళుక్య వంశస్థాపకు డాయెను. ఆతడు పల్లవులను, కందరరాజు మనుమని నిర్జించెను. దానితో ఆంధ్రమున, ఆనందుల, పల్లవుల అధికార మంతమయ్యెను.

డాక్టర్ దినేశ్‌చంద్ర సర్కార్‌వంటి చరిత్రకారులు మట్టెపాడు, గోరంట్ల శాసనములలోని బిరుదములను పరిశీలించి దామోదరవర్మ, అత్రివర్మ తరువాతి వాడని, అతని పుత్రుడని అభిప్రాయపడుచున్నారు. మరియు ఆనందరాజులను వేంగీ సాలంకాయనులు కూలద్రోసిరని కూడ అభిప్రాయ పడుచున్నారు. లిపి ఆధారముగానూ, శాసనములలో ప్రాకృతనామముల వాడుకవలననూ మట్టెపాడు శాసనము మొదటిదని, దామోదరవర్మ మొదటి రాజని నిర్ణయించి చెప్పవీలులేదని వారి అభిప్రాయము.

# 5. వేంగీపుర సాలంకాయనులు
## (క్రీ. శ. 300-420 ప్రాంతము)

సాలంకాయనులుకూడ బృహత్ఫలాయనులవలె ప్రాచీన వంశీకులే. టోలెమీ వారిని సాలంకెనోయ్ అని పేర్కొని, గోదావరికి పశ్చిమము నుండి మైసోలియా వరకు ఉన్న ప్రదేశమున వారువున్నట్లు చెప్పెను. క్రీ. శ 60 ప్రాంతమునాటికే (పెరిప్లస్ గ్రంథకాలము) వారు ప్రాభవములోనున్నట్లు తోచును. అందు పేర్కొన్న బెనగూరాన్ వేంగీపురమును; మాగరిస్ మంజీరయు అయి ఉండనచ్చును. మాగరిస్ కృష్ణాముఖద్వారము వద్ద నున్నది. వారు కూడ బృహత్ఫలాయనులవలె తీరప్రాంత రక్షణకు నియమితులైనట్లు తోచును. ఇట్లు ఈ రెండువంశములును హిరణ్యకులును (అరూర్నోయ్; అర్వర్నోయ్, ఆరురాని లేక అనర్ఘి) సమకాలిక ప్రాభవమును, ఆంధ్రసామ్రాట్సామంతులుగా ననుభవించి యుండవచ్చును. బృహత్ఫలాయనుల, ఆనందుల తరువాత సాలంకాయను లాంధ్రమును పాలించిరని శాసనములు తెలుపు చున్నవి.

సాలంకాయనుల శాసనము లయిదు దొరికినవి. మొదటిది విజయదేవ వర్మ ఏలూరు ప్రాకృత దాన శాసనము. రెండవది విజయనందివర్మ కొల్లేరు శాసనము మూడవది నందివర్మ వేగిశాసనము. నాల్గవదియు, అయిదవదియు, విజయస్కంద, నందివర్మ లిచ్చిన కంటేరు శాసనములు.

సాలంకాయన గోత్రులు కూడ బృహత్ఫలాయనులు, పల్లవులవలె బ్రాహ్మణులే. వారు వర్మ అను చరమనామమును అప్పటి ఆచార ప్రకారము వహించిరి. వీరి పూర్వీకుడు విశ్వామిత్రుని కుమారుడైన సలంకు లేక, సలంక అనువాడు. సాలంకాయనుడు సలంక వంశీకుడు. సాలంక్య సంతతివారికి రెండు గోత్రములు కలవు. ఒకటి పంచార్షేయమైన భరద్వాజ గోత్రము. రెండవది త్రయార్షేయమైన విశ్వామిత్రగోత్రము. వీరిది వృషభ లాంఛనమే. ఈ సాదృశ్యము వలనను, శాసనసాదృశ్యము వలనను, వారికి పల్లవులతోగల మైత్రి వలనను సగోత్రీకతవలనను వారికి పల్లవులతో సంబంధమున్నట్లు తోచును. పల్లవుల వలె వారి బిరుదముకూడ 'బప్ప భట్టారక పాదభక్త' అని. ఇది ఆంధ్రసామ్రాట్టుల,

వారి వారసరాజుల మాతృసంప్రదాయమునకు విరుద్ధము. ఏమన 'బప్ప' అనగా గౌరవనీయుడైన తండ్రి అని అర్థము. ఇది దక్షిణాపథములో మూడవ, నాల్గవ శతాబ్దముల నుండి ప్రచారములోనికి వచ్చెను. ఆంధ్రమున కూడ ప్రవర్తమాయెను.

సాలంకాయనుల దైవము చిత్రరథస్వామి. వారు చిత్రరథస్వామి పాదాను ధ్యాతులు. చిత్రరథుడన సూర్యుడని అర్థము. సాలంకాయన లాంఛనము సూర్య బింబము. ఇది ఆంధ్రమున మొదటిసారిగా సూర్యపూజా సంప్రదాయ మంకురించి నట్లు చూపును. వేంగీపురమున సూర్యాలయ మున్నట్లు తోచును. ఏలూరు సమీప మున నున్న పెదవేగియే వేంగీపురము,

ప్రాకృత శాసనములు సంస్కృత శాసనములకన్న ప్రాచీనములని శాసన వేత్తల అభిప్రాయము. అందుచేత మహారాజు విజయదేవవర్మ ఏలూరు శాసనము మొదటిది. ఇది మూడవ శతాబ్ది చివరి సంవత్సరములది కాని నాల్గవ శతాబ్ది మొదటి సంవత్సరములది కాని అయియుండును. లిపి దృష్ట్యా ఇది నాల్గవశతాబ్దా రంభములోనిదని చెప్పవచ్చును. ఈత డశ్వమేధయాజి. వేంగీరాజ్యము గోదావరి తీరము నుండి కృష్ణాతీరము వరకు, పశ్చిమమున తెలంగాణము లోనికి వ్యాపించి యుండెను.

విజయదేవవర్మను మిగత శాసనములు పేర్కొనలేదు. నందివర్మ పెదవేగి శాసనము మాత్రము నాల్గుతరములను పేర్కొనెను. విజయనందివర్మ కొల్లేరుశాసనము అతడు చండవర్మ పెద్దకుమారుడని చెప్పెను. విజయస్కందవర్మ, నందివర్మల కంటేరు శాసనములు కూడ పూర్వీకులను పేర్కొనలేదు. కంటేరు శాసనములోని నందివర్మ, కొల్లేరు శాసనములోని విజయనందివర్మకును, పెదవేగి శాసనములో నందివర్మకును పూర్వీకుడై ఉండును. ఇది లిపి ఆధారముగా ఏర్పడు అభిప్రా యము. అలహాబాదు శాసనము (సముద్రగుప్తునిది) పేర్కొన్న వైంగేయక హస్తివర్మ సాలంకాయనులలో మొదటివాడని కొందరి అభిప్రాయము. కాని లిపి ఆధారముగా విజయదేవవర్మ మొదటి వాడని తోచును. శాసనములలో కన్పడు అర్గురు సాలంకాయనులకు ఒక్కొక్కరికి ఇరువదేసి సంవత్సరములు రాజ్యకాలమని ఊహించి వారిక్రమము నిట్లు చెప్పవచ్చును. 1. విజయదేవవర్మ (క్రీ.శ. 300-335 ప్రాంతము). 2. హస్తివర్మ (335-350) 3. మొదటి నందివర్మ (350-370) 4. చండవర్మ (370-395) 5. రెండవ విజయనందివర్మ (395-410) 6. విజయ స్కందవర్మ (410-420). సముద్రగుప్తుని దక్షిణాపథ దండయాత్ర (క్రీ.శ. 343)

ఈ సాలంకాయన కాలమానమునకు ఆధారము. వారి రాజ్యకాలము సుమారు 120 సంవత్సరములు అయియుండును. విజయదేవవర్మ ప్రాబల్యము కదంబమయూర శర్మతోపాటు ఆరంభ మయినట్లు తోచును. సాలంకాయనుల అయిదు శాసనములు నాల్గవశతాబ్దిలోనివే.

విజయదేవవర్మ ఆనందులను కూలద్రోసి ప్రాముఖ్యతలోనికి వచ్చి, వేంగిలో స్వతంత్రుడయ్యెను. ఆతని వేంగీరాజ్యస్థాపన గుప్తసామ్రాజ్య, కదంబరాజ్య స్థాపనలతో సమాకాలికము. ఆతని పూర్వికులు వేంగిరాజులై యుందురు. అదను చూచుకొని వారు గోదావరి, కృష్ణల మధ్యప్రదేశము నాక్రమించిరి. ఇది బృహత్ఫ లాయనుల పతనానంతరమయి యుండును. విజయదేవవర్మ కూడ మొదట సామంతుడే, ఆతని రాజ్యము తూర్పుతీరమునుండి పశ్చిమమున తెలంగాణములోనికి, ఉత్తరమున దక్షిణకోసలములోనికి వ్యాపించియుండును. దాని దక్షిణపుటెల్ల పల్లవ రాజ్యము, ఉత్తరపుటెల్ల వాకాటక సామ్రాజ్యము, పశ్చిమపుటెల్ల కదంబరాజ్యము అయిఉండును. ఈతడశ్వమేధయాజి. ఈ బిరుదము సార్వభౌమాధికారము సూచించును. ఈతని వారసులుగాని, మయూరశర్మగాని, పల్లవ రెండవ విజయ స్కందవర్మగాని ఈ బిరుదు వహించలేదు. మొదటి చంద్రగుప్తుడు కూడ అశ్వ మేధయాజికాడు. కదంబులు, పల్లవులు పరస్పర కలహములలో మునిగియుండిరి. వారు సమబలులు. పల్లవుల కానందులతో కలహముండెను. అందుచే వారు సాలంకా యనులతో మైత్రినెరపిరి. అయినను మయూరశర్మను నిర్జించలేకపోయిరి. ఉత్తరమున గుప్తులింకను సార్వభౌమత్వములోనికి రావలసియుండెను. దక్షిణమున వాకాటక సామ్రాజ్య క్షీణత ఆరంభమయ్యెను. అందుచే విజయదేవవర్మకు దక్షిణా పథమున ప్రబలుడగు అవకాశము కలిగెను.

విజయదేవవర్మ, వాకాటక మొదటి ప్రవరసేనుని చివరి కాలములో ఆతని సమకాలికుడు. ఆ సమయమున నాతడాంధ్రమున సార్వభౌమత్వము నొందెను. సాలంకాయనులను తమ ఆంధ్రభాగముల నాక్రమించకుండ అరికట్టగల స్థితిలో లేరు వాకాటకులు. ఈతడశ్వమేధమును క్రీ. శ. 325 ప్రాంతమున చేసియుండును. అతని ఘనకార్యముల దృష్ట్యా అతడు 35 సంవత్సరములు పాలించినట్లు తోచును. అతని రాజ్యకాలము దక్కను చరిత్రలో ముఖ్యమైనది. ఇక్ష్వాకుల తరువాత బృహత్ఫలాయనులు ఆనందులు సాధించలేని సర్వాంధ్రసంఘటనను ఆతడు సాధించెను. బృహత్ఫలాయనులకును, ఆనందులకును పల్లవులడ్డుగోడగా నుండిరి.

అంతేకాక పునరుద్ధరణపొందిన బ్రాహ్మణము, క్షీణతలో ఉన్న బౌద్ధము కూడ వారికి ప్రతికూలముగా నుండెను. బ్రాహ్మణ సాలంకాయనులు పల్లవుల ఉధృతము నణచ గలిగిరి. వారుత్తరాంధ్రమునంతను తమ ఏలుబడిలోనికి తెచ్చుకొని, పల్లవులను మిత్రులుగా చేసికొన గలిగిరి. వారి సార్వభౌమాధికారమును పల్లవులుకూడ అంగీక రించ వలసివచ్చెను.

విజయదేవవర్మ తన్ను 'పరమ మాహేశ్వరుడ' నని పిల్చుకొనెను. ఆతని వారసులు తమ్ము 'పరమ భాగవతుల'మని పిల్చుకొనిరి. వారు వైష్ణవమునకు మారి యుందురు. సూర్యపూజ విష్ణుపూజగా మారియుండవచ్చును. ఈతని శాసనమతని పదమూడవ రాజ్యసంవత్సరమునాటిది. ఈ శాసనమొక రాజాజ్ఞగా నున్నది. గ్రామాధికారికి మున్యాద లేక మున్యాద ముఖ్యుడను అధికారనామమున్నది. ఈ సరికే ఆతడు దిగ్విజయము, అశ్వమేధము చేసియుండ వచ్చును.

విజయదేవవర్మ వారసుడు హస్తివర్మ అయియుండును. వారి సంబంధము తెలియదు. విజయదేవవర్మ మరణాంతరము అతడు సింహాసన మాక్రమించి యుండును. హస్తివర్మ బలవంతుడు. సామ్రాజ్యమును కాపాడినవాడు. ఈతని శాసనము లేవియులేవు కాని విజయ నందివర్మ పెదవేగి శాసనమతనిని 'అనేక సమర అవాప్త విజయు'డని చెప్పుచున్నది. ఆతడు తనజ్ఞాతులతోను, రాజ్యములోని ఇతర వైరులతోడను తన స్థానమును సుస్థిరము చేసికొనుటకు పోరాడి యుండును. ఈతని ముఖ్యకార్యము సముద్రగుప్తుని అడ్డుకొనుట. అతడు తన సామంతులను, పల్లవరాజును, ఆతని సామంతులను ఒక సమాఖ్యగాచేసి సముద్రగుప్తుని నిరోధించెను.

హస్తివర్మ కుమారుడైన నందివర్మ రాజ్యకాలమునుగురించి ఏమియు తెలియదు. ఆతని మనుమని పెదవేగి శాసన మాతనిని 'వివిధ ధర్మప్రధానః' అని చెప్పెను. ఇది ఆతడు శాంతి భద్రతలను ఐశ్వర్యమును నెలకొల్పి, అన్ని మతములను సమముగా నాదరించి చాలకాలము పాలించెనని సూచించును. నందివర్మ కంచేరు శాసనము విజయనంది వర్మ పెదవేగి, కొల్లేరు శాసనములకు విభిన్నము. అందుచేత దానిని మొదటి నందివర్మకాలము నాటిదని భావించవచ్చును.

నందివర్మ తరువాత అతని కుమారుడు చండవర్మ రాజ్యమునకు వచ్చెను. ఈతని కాలమున రాజ్యవిస్తరణ జరిగినట్లు తోచును. పెదవేగి శాసన మతనిని 'ప్రతాపోపాంత సామంతస్య' అని పేర్కొనెను. అతని శాసనములేమియు లేవు.

వాని పెదవేగి శాసనలిపి ఆతడు పల్లవ రెండవ సింహవర్మకును (క్రీ.శ. 364-85 ప్రాంతము) కళింగమహరాజు చండవర్మకును సమకాలికుడు అని సూచించును. కళింగదేశములోని సామంతులాతని కెదురు తిరిగి ఓటుపడి యుండవచ్చును.

చండవర్మ వారసుడాతని కుమారుడు విజయనందివర్మ లేక రెండవ నందివర్మ అయియుండును. ఆతనికాలమున సాలంకాయనులు కొన్ని భాగములను గోల్పోయిరి. ఈతని తరువాత సాలంకాయనులు క్షీణించనారంభించిరి. ఈతనివి రెండు శాసనము లున్నవి. వానిలో కాలము లేదు. ఇది దేశాధిపతి, ఆయుక్తక, వల్లభ, భోజక, రాజపురుష, ఆజ్ఞప్తి మున్నగు రాజోద్యోగ నామములను సూచించును. రహసాధికృత అను మరొక ఉద్యోగ నామమున్నది. సాలంకాయనుల కాలములో ప్రాలూర గొప్ప రేవుపట్నము. దానిని టోలెమీకూడా పేర్కొనెను

విజయ నందివర్మ వారసుడు విజయ స్కందవర్మ. ఇతనిది రెండవ కంచేరు శాసనము మాత్రమే. ఇది అతని రాజ్యారంభము నాటిది. ఇది నియోగ, విషయపతి, మిశ్ర అను ఉద్యోగనామములను పేర్కొన్నది. ఈతడు చివరివాడుగా తోచును. సాలంకాయన రాజ్యము 420 ప్రాంతమున అంతరించెను. ఈతని కాలమున పల్లవ ప్రాభవముకూడ అంతరించెను. రెండవ విష్ణుగోప వర్మ మృతికి, మూడవ సింహవర్మ ప్రగతికి నాల్గుదశాబ్దుల (395-435) వార ఉన్నది. ఈ కాలము పల్లవులకు, సాలంకాయనులకుకూడ క్లిష్టమైనది. ఈ కాలములో విష్ణుకుండినులు ప్రబలి సాలంకాయనులను కూలద్రోసిరి. పల్లవులు కదంబుల తాకిడికి తమ దేశములో నిల్చి మరల ప్రబలగా, సాలంకాయనులు విష్ణు కుండినుల చేతిలో నశించిరి.



# 6. విష్ణుకుండినులు
## (క్రీ. శ. 420-620 ప్రాంతము)

ఇక్ష్వాకుల తర్వాత విష్ణుకుండినులు మాత్రమే అయిదు, ఆరు శతాబ్దములలో ఆంధ్రమంతటా, కళింగమునందును సార్వభౌమత్వాధికారము నెరపి దక్షిణాపథమున చక్రవర్తులవలె ఉండిరి. పలువురు చరిత్రకారులు వారి చరిత్ర నిర్మించ యత్నించిరి. వీరి చరిత్రకు ఆధారములు, వీరి సంస్కృతశాసనములు వారి సమకాలికుల శాసనములు. వారి శాసనము లయిదు. 1. రెండవ విక్రమేంద్రవర్మ పదవరాజ్య సంవత్సర చికుళ్ళ శాసనము. 2. మహారాజ ఇంద్రవర్మ ఇరువదవ రాజ్య సంవత్సర రామతీర్థం శాసనములు: 3. మూడవ మాధవవర్మ నలుబది ఎనిమిదవ సంవత్సర పోలమూరు తామ్రశాసనము. 4. ఇతనిదే ముప్పది ఏడవ రాజ్య సంవత్సర ఇపూరు శాసనము. 5. ఇతనిదే ఇరువది ఏడవరాజ్య సంవత్సరపు ఇపూరుశాసనము. ఇవికాక, ప్రచురణకాని వేల్పూరు శాసనము వేరొకటి ఉన్నది. సంస్కృత, తెలుగు వాఙ్మయములలో వారి ప్రస్తావన కలదు. మెకంజీ సేకరించిన స్థానిక పత్రములలో కూడ వారి ప్రస్తావన కలదు.

లిపి దృష్ట్యా రెండవ మాధవవర్మ రెండవ ఇపూరు శాసనము మొదటిదిగా తోచును. ఈ శాసన మారవశతాబ్ది ఆరంభమునాటిదని తోచును. మూడుతరముల వారిని-మహారాజు మొదటి మాధవవర్మ, శ్రీదేవవర్మ, మహారాజు రెండవ మాధవవర్మలను - ఇది పేర్కొన్నది. మొదటి మాధవవర్మను 'ఏకాదశాశ్వమేధ అవభృత అవధూత జగత్కల్మషస్య, అగ్నిష్టోమ సహస్రయాజినోనేక సామంతమకుట కూట మణిఖచితచరణ యుగళక మత్స్య మహారాజస్య' అని పేర్కొన్నది. అతని మనుమడు దేవరవర్మకు మహారాజు బిరుదమివ్వక 'క్షత్రియ స్కంద పరివృత అప్రతిమ విఖ్యాత పరాక్రమస్య' అని పేర్కొన్నది. దేవవర్మ పరిపాలన ప్రశాంతముగానుండి యుండవచ్చును, లేక త్వరలో మరణించి యుండును. ఆతని పుత్రుని 'విష్ణుకుండినామ్ శ్రీమాధవవర్మ' అని పేర్కొన్నది. లేదా శాసనకారుడు పరాకున మహారాజ బిరుదు ఇచ్చుట మరచియుండవచ్చును. రెండవ మాధవవర్మ బిరుదులు 'త్రికూటమలయాధిపతిః, భగవత్ శ్రీపర్వత స్వామి పాదాను ధ్యాతః' 'నయవినయ సత్త్వసంపన్నః' అనునవి.

కాలరీత్యా రెండవశాసనము ఇంద్రవర్మ రామతీర్థశాసనము; మూడవది రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనము ఈశాసనములు నాల్గుతరములను- మహారాజు మాధవవర్మ, మొదటి శ్రీవిక్రమేంద్రవర్మ, మహారాజు ఇంద్ర భట్టారక వర్మ, మహారాజ రెండవ విక్రమేంద్రవర్మ అనువారిని పేర్కొనును. రామతీర్థశాసనములోని మాధవవర్మ బిరుదులు 'భగవచ్ఛ్రీపర్వతస్వామి పాదానుధ్యాతః, సకల మహామండల అవనత సామంత మకుట మణికిరణ అవలీఢ చరణ విఖ్యాతయశః శ్రీమన్మహారాజ'. 'తస్యోర్జిత శ్రీయో విష్ణుకుండిన పార్థివో ... ... ... తిలకస్య, సముద్భూత ఏకాదశాశ్వమేధ అవభృత్ అవధూత జగత్కల్మషస్య, క్రతుసహస్ర యాజిన స్నానపుణ్యోదక పవిత్రీకృత శిరసః' ఇవి చిక్కుళ్ల శాసనములోని మాధవవర్మ బిరుదుల వంటివే. మాధవ వర్మను 'భగవత్ శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతో విష్ణుకుండినామ్, ఏకాదశాశ్వ మేధ అవభృత్ అవధూత జగత్కల్మషస్య క్రతుసహస్ర యాజినః, సర్వమేధా హ్వప్త పర్వభూత పదరాజస్య బహుసువర్ణ పౌండరీక పురుషమేధ వాజపేయ ఉక్త షోడశ రాజసూయ ప్రౌఢిరాజ్య ప్రాజాపత్యాది అనేక వివిధ పృథుక్రతు వరశత సహస్రయాజినః క్రతువరానుష్ఠాధిష్ఠిత ప్రతిష్ఠిత పరమేష్టిత్వస్య మహా రాజస్య సకలజగన్మండల గురుపృథుక్షితి పతిమకుటమణిగణ నికర అవనతపాద యుగళస్య' అని పేర్కొన్నది. అందుచే రామతీర్థశాసనములోని మాధవవర్మ, చిక్కుళ్ళ శాసనములోని రాజు ఒకరే అని తోచును. అతడు విష్ణుకుండిన వంశ స్థాపకుడై దానికి సార్వభౌమత్వమును తెచ్చెను.

తరువాత మొదటి విక్రమేంద్రవర్మ, రామతీర్థ శాసన మాతనిని 'రాజన్' అనే పిలవగా చిక్కుళ్ల శాసనములో అదియునులేదు. విక్రమేంద్రవర్మ తన తండ్రి అంతటివాడు కాలేదు. అతనిని 'ఉభయవంశ ఆత్మజాలంకారభూతః' అని రామతీర్థశాసనము, స్ప్రదీప్త 'విష్ణుకుండిన వాకాట(క) వంశద్వయాలంకార చిన్మనః' అని చిక్కుళ్ల శాసనము అన్నవి. ఇది విష్ణుకుండిన వాకాటక వివాహసంబంధమును చెప్పుచున్నది.

విక్రమేంద్రవర్మ పుత్రుడు ఇంద్రభట్టారకవర్మ. అతనిని 'ప్రియసూనని' అని శాసనములు పేర్కొన్నవి. 'భట్టారక' ఈతడు సమార్జించిన గౌరవమును తెలియచేయును. రామతీర్థ, చిక్కుళ్ళ శాసనములలో ఒకేవిధమైన ప్రశంస కలదు. రామతీర్థ శాసనమతనిని 'అనేక చతుర్దంత సమరశత సంఘట్ట విజయ' అన్నది.

చిక్కుళ్ళ శాసనము 'అనేక చతురంత సమర సంఘట్ట ద్విరదగణ విపుల విజయస్య' అన్నది. చికుళ్ల శాసనము రెండవ విక్రమేంద్రవర్మ ఈతని జ్యేష్ఠ పుత్రుడన్నది. ఇపూరు రామతీర్థశాసనములలో మాధవవర్మ లిరువురు ఒకరే అని తోచుచున్నది. ఆతడు వంశస్థాపకుడు, ప్రథమ సార్వభౌముడు. దేవవర్మ, మొదటి విక్రమేంద్రవర్మ ఆతని పుత్రులు. రెండవ వాని జనని వాకాటకరా కుమార్తె. ఈ విధముగా విష్ణుకుండినులారుగురు ఉన్నట్లు తోచును :- 1. మొదటి మాధవవర్మ, 2. దేవవర్మ, 3. రెండవ మాధవవర్మ, 4. ఆతని పినతండ్రి మొదటి విక్రమేంద్రవర్మ, 5. ఈతని కుమారుడు ఇంద్ర లేక ఇంద్ర భట్టారక వర్మ, 6. ఈతని పుత్రుడు రెండవ విక్రమేంద్రవర్మ.

మరి రెండు శాసనములున్నవి. గోవిందవర్మ పుత్రుడు మాధవవర్మ మొదటి ఇపూరు శాసనము, మూడవ మాధవవర్మ పొలమూరు శాసనము. ఇపూరు శాసనము మాధవవర్మను. ఆతని తండ్రి గోవిందవర్మను, తనయుడు మంచ్యన్న భట్టారకుని పేర్కొన్నది. పొలమూరు శాసనము మూడుతరములనేకాక, మరికొంత సమాచారము చెప్పుచున్నది అది దాతను, అతని పితృ, పితామహులను పేర్కొన్నది. దీని ప్రకారము విక్రమేంద్రవర్మ వారసులు గోవిందవర్మ విక్రమాశ్రయి, మాధవర్మ జనాశ్రయి, మంచ్యన్న భట్టారకులున్నారని తెలియుచున్నది. లిపి దృష్ట్యా, ఇతర వివరముల దృష్ట్యా ఇది సరి అని తోచుచున్నది. వీనిలోని త్రివరనగరము సోమవంశి రాజుల లేక ఉత్తర గుప్తుల మహా కోసల రాజధాని. మొదటి మూడు శాసనములు గోవిందవర్మను, మంచ్యన్న భట్టారకుని పేర్కొనన లేదు. మొదటి ఇర్వురు మాధవవర్మలకు జనాశ్రయ బిరుదములేదు. ఈ రెండు శాసనములు మాధవవర్మ ఏమియు క్రతువులొనరించినట్లు చెప్పలేదు. మరియు ఇతనికే హిరణ్యగర్భ ప్రసూతిః అని బిరుదున్నది. పరమ బ్రహ్మణ్యుడన్న బిరుదుకూడ ఉన్నది. ఇట్లు మొదటి మాధవవర్మ వంశస్థాపకుడు, వాకాటక రాకుమార్తె భర్త, ఏకాదశాశ్వమేధయాజి. రెండవ మాధవవర్మ త్రికూట మలయ పర్వతస్వామి. మూడవ మాధవవర్మ జనాశ్రయుడు, ఏకాదశాశ్వమేధ యాజి, త్రివరనగరి రాకుమార్తెల మనోహరుడు. మరియు విక్రమహేంద్రవర్మ మొదటి విక్రమేంద్రవర్మ ఒకరుకారు. 'ఉభయ వంశాత్మజాలంకార భూతః' 'ప్రదీ ప్తవిష్ణు కుండి వాకాటక వంశద్వయాలంకార' అను బిరుదులు విక్రమేంద్రవర్మకే ఉన్నవి. పొలమూరు శాసనము విక్రమహేంద్రవర్మను 'అప్రతిహత శాసనస్య స్వప్రతాపో

ప్రాన్త సామంత మనుజ పతిమండలస్య విరహితరిపుషడ్వర్గస్య విధివదుపచిత త్రివర్గస్య విబుధవతి సాధ్య శరీర విభవబల పరాక్రమస్య' అని చెప్పుచున్నది. చిక్కుళ్ళ శాసనము రెండవ విక్రమేంద్ర వర్మను 'గరిష్ట శైశవ ఏవ సకలనృప గుణాలంకృతస్య సమ్యగధ్యారోపిత సకలరాజ్య భారః' అని అన్నది. చిక్కుళ్ళ, రామతీర్థ శాసనము లిట్లు ఈరెంటిలోని విక్రమహేంద్రవర్మలు ఒకరే అని సూచించు చున్నవి. ఈ విధముగా మరి మూడు తరములు, మొత్తము తొమ్మిది తరముల విష్ణుకుండినులాంధ్రమును పాలించిరి.

పొలమూరు వద్ద దొరికిన మూడవ మాధవవర్మ శాసన ప్రదేశములోనే దొరికిన మహారాజు మొదటి జయవల్లభ దేవుని (తూర్పు చాళుక్య) శాసనము అది మూడవ మాధవవర్మ నలుబది ఎనిమిదవ రాజ్య సంవత్సరము నాటిదని రూఢి చేయుచున్నది. ఇది అతని రాజ్యారంభ కాలము తెలిసికొనుటకుకూడ తోడ్పడును. ఈ శాసనముల రెంటికి గృహీతలనుబట్టి అర్ధశతాబ్ది వ్యవధి నూహించవచ్చును. రెండవపులకేశి ఆంధ్రమును క్రీ. శ. 611 తో జయించి యుండెను. క్రీ. శ. 624 ప్రాంతంలో కుబ్జ విష్ణువర్ధనుడు పిష్టపురములో ఆంధ్రాధీశ్వరుడయ్యెను. మూడవ మాధవవర్మ క్రీ. శ. 611 ప్రాంతంలో మరణించి యుండును. దానికి కొన్ని సంవత్సరములకు ముందాతడు పొలమూరు శాసన మిచ్చియుండును. అది ఆరవ శతాబ్ది ఆఖరు అయిఉండును. అందు పేర్కొన్న చంద్రగ్రహణము క్రీ.శ. 594 లో సంభవించెను. మూడవ మాధవవర్మ రాజ్యారంభము అందుచే క్రీ. శ. 546 లో అయిఉండును (క్రీ. శ. 546-611). దానితో ఆతని పూర్వీకుల రాజ్యకాలములను కూడ ఊహించవచ్చును. మూడవ మాధవవర్మ రెండవ పులకేశిచే నిర్జితుడు, నిహతుడు అయియుండును. ఇట్లాతని రాజ్యకాలము 65 సంవత్సరములగును. ఆతడు పసివాడుగనే రాజ్యమునకు వచ్చియుండును. అతని తండ్రి గోవిందవర్మ రాజ్యకాలము 5, 6 సంవత్సరములయి ఉండును (క్రీ. శ. 540-46). ఆతని తండ్రి రెండవ విక్రమేంద్రవర్మది పదవరాజ్యకాలమునాటి శాసనము ఒకటిమాత్రమే దొరకుటచే అతనిది పదిసంవత్సరముల రాజ్యకాలమై యుండును (క్రీ. శ. 530-40). విక్రమేంద్రవర్మ తండ్రి ఇంద్ర భట్టారక లేక ఇంద్రవర్మది ఆతని 28 వ రాజ్య సంవత్సరపు రామతీర్థ శాసనము. ఆతని రాజ్యకాలము 30 సంవత్సరములు (క్రీ. శ. 500-30) అయిఉండును. మధ్య 7 సంవత్సరములు (క్రీ.శ. 493-500) మరొకడు దురాక్రమణచేసి యుండును. ఈతని తండ్రి మొదటి విక్రమేంద్రవర్మ

వృద్ధుడైయుండి 5 సంవత్సరములు (క్రీ. శ. 488-93) రాజ్యము చేసియుండును. అతనికి పూర్వుడు అతనిజ్ఞాతి రెండవమాధవవర్మ. ఇతని ఇపూరుశాసనమాతని 27వ రాజ్య సంవత్సరముది. ఆతని రాజ్యకాల సంఘటనలుకూడ ఆతనిది ముప్పది సంవత్సరముల పరిపాలన (క్రీ. శ. 458-88) అని సూచించును. ఆతడు కాంచి పల్లవ నాల్గవ స్కందవర్మ లేక త్రిలోచనుని సమకాలికుడు. ఈతని తండ్రి దేవవర్మ. ఇపూరు శాసనమితనిది చాలతక్కువ రాజ్యకాలమని సూచించును. అది 2, 3 సంవత్సరములు (క్రీ. శ. 455-58 లేక 460) అయిఉండును. ఇతడు పల్లవ మూడవ సింహవర్మ సమకాలికుడు. ఆతని తండ్రి మొదటి మాధవవర్మ. ఆతని రాజ్యకాలము 35 సంవత్సరములు (క్రీ. శ. 420-55) అయిఉండును. విష్ణుకుండిన ప్రాబల్యారంభము సాలంకాయనుల క్షీణత క్రీ. శ. 420 లోనే మొదలయ్యెను. పల్లవ మూడవసింహవర్మ దక్షిణాంధ్రమును క్రీ. శ. 430 నాటికాక్రమించుకొనెను ఇది మొదటి మాధవవర్మ మృతితరువాత. అది దేవవర్మ రాజ్యకాలములో జరిగెను. ఈ విష్ణుకుండినుల కాలము దక్షిణాపథమందలి ఇతర రాజ్యముల చరిత్ర దృష్ట్యా కూడా కొలది మార్పులతో సరిపోవును.

విష్ణుకుండి వీరి వంశనామముగాని కుటుంబనామముగాని అయియుండును. దేవవర్మ రెండవ ఇపూరు శాసనము వీరిని 'క్షత్రియావస్కంద ప్రవర్తిత అప్రతిమ విఖ్యాతపరాక్రమస్య' అని చెప్పుటచే వీరు బ్రాహ్మణులై ఉందురని తోచుచున్నది. వీరు వినుకొండ (విష్ణుకుండిన) నగరవాసులైయుండి ఆ గ్రామ నామమును వంశనామముగా చేసికొనియుండవచ్చును. ఈ నగరము కీలకస్థానముగ తరువాతి కాలములో కూడ ప్రాముఖ్యతలో నుండెను. ఇట్లు విష్ణుకుండినులాంధ్రులు. వారి సమకాలికులు వారి నాంధ్రులనిరి. వినుకొండవద్ద పసువులేరు గుండ్లకమ్మలో (బహ్మకుండి) కలియుచున్నది. అందుచే దాపుననున్న నగరము విష్ణుకుండిన నగరమని పేరొందియుండును. విష్ణుకుండినులు తమ్ము 'భగవత్ శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతలుగ పిల్చుకొనిరి. రెండవ మాధవవర్మ బిరుదు త్రికూటమలయాధిపతి' వారు కర్మరాష్ట్ర (గుంటూరు మండలము) మందలి శ్రీ పర్వతసమీపము వారని, శ్రీశైలము కూడ శ్రీ పర్వతముగా పేరొందుటచే వారు మల్లికార్జున శివభక్తులని ఊహించవచ్చును. కోటప్పకొండకు త్రికూటమని అచ్చటి ఈశ్వరునకు త్రికూటేశ్వర అని నామములున్నవి. తూర్పు కనుమలకు మలయపర్వతములని పేరున్నది.

రెండవ మాధవవర్మ రాజధాని అమరపురము. అది ధాన్యకటకమువద్ద నున్నది. ఇప్పటి ధరణికోట (అమరావతి) అది అయి యుండును. ధాన్యకటకము పల్లవరాజు త్రిలోచనుని రాజధాని. ఆతడు దేవవర్మ కాలములో దక్షిణాంధ్రమును ఆక్రమించియుండును. మరల రెండవ మాధవవర్మకాలములో విష్ణుకుండినులు ప్రబలి అమరపురము రాజధానిగా పాలించియుండవచ్చును.

ఇక్ష్వాకుల పతనము విష్ణుకుండినుల ప్రాబల్యముల మధ్య ఒకటిన్నర శతాబ్దికాలము కలతలతో కూడినది. పల్లవులకు ఆంధ్రరాజులకు యుద్ధములు జరుగు చుండెను. పల్లవరాజ్యము కృష్ణవరకు ఉండెను. అందుచే కర్మరాష్ట్రము పల్లవులకు ఆంధ్రులకు కలహకారణమయ్యెను. మొదటి విష్ణుకుండినశాసనము వారి కానందులతో గల సంబంధమును సూచించును. కృష్ణా దక్షిణతీరమున వీరు ఆనందుల స్థాన మాక్రమించిరి. అత్తివర్మ మరణానంతరము వీరు స్వతంత్రులై ఉందురు. ఆనందు లకు త్రికూట పర్వతపతులను బిరుదుకలదు.

ఐదవ శతాబ్దిలో కదంబులు ప్రబలి పల్లవప్రాబల్యమును కుంటుపరచిరి. ఇది కకుత్థ్సవర్మకాలము. నాటినుండి కుంతల మన్నివైపుల విస్తరించనారంభించెను. వివాహసంబంధములు వారిని బలపరచెను. వారు గుప్తులలో కూడ అట్టి సంబంధ ములు కలిగియుండిరి. క్రీ. శ. 435లో ఆతని పుత్రుడు కృష్ణవర్మ అశ్వమేధము చేసెను. ఇదే కాలములో విష్ణుకుండినుడగు మొదటి మాధవవర్మక్రింద ఆంధ్రము ప్రబలెను. పల్లవులు దక్షిణాంధ్రమునుండి మరల వలసివచ్చెను.

1. మొదటి మాధవవర్మ, ఘనుడు : మొదటి మాధవవర్మ ఎట్లు ప్రబలు డయ్యెనో చెప్పుట కష్టముకాని ఆతడు సాలంకాయనులను నిర్జించి పల్లవులను పారద్రోలి చిన్నరాజులనందరి వశపర్చుకొనెను. ఆతడు మహాయోధుడు, న్యాయ పాలకుడు, రాజనీతివేత్త. విష్ణుకుండినులు అసహాయశూరులై ప్రబలియుండవచ్చును. వారి పూర్వీకులు ఇక్ష్వాకుల, బృహత్ఫలాయనుల, ఆనందులకాలమున సమర్థులైన ఉద్యోగులై యుండవచ్చును. మాధవవర్మ ప్రాబల్యము కృష్ణా దక్షిణతీరమున, ఆనందుల క్షీణతతో, వేంగీ సాలంకాయనుల పతనముతోను, పల్లవుల అవనతితోను, సమకాలికము. కందరపుర సోమదేవ, కటకవల్లభ, మాధవశర్మ, మాదవవర్మల ఐతిహ్యము ఒకటి కలదు. క్రీ. శ. 420-30 మధ్య మాధవవర్మ పల్లవులను, సాలంకాయనులను నిర్మూలమొనర్చి సర్వాంధ్రచక్రవర్తి అయి ఉండును. ఈతడు ఏకాదశాశ్వమేధములు, రాజసూయము ప్రౌఢిరాజ్య సర్వ

మేధము, పురుషమేధము మున్నగు మహాక్రతువులను చేసెను. కుంతలులు, పల్లవులవలని భయముచే, విష్ణుకుండిన మిత్రులుగానుండిరి. వాకాటక నరేంద్రసేనుడు కూడ పసివాడగుటచే విష్ణుకుండినులమైత్రి నభిలషించెను. వాకాటకులు మొదటి మాధవవర్మతో వివాహసంబంధములు కూడ నెరపిరి. ఆతడు నరేంద్రసేనుని సోదరిని పరిణయమాడి యుండును. పల్లవ కదంబ కలహములు మాధవవర్మను ఆంధ్రమున తనక్రింద ఏకముచేయు అవకాశము కలిగించెను. ఆతడు తన్ను చక్రవర్తినని చెప్పికొనెను. ఆంధ్ర, కళింగములలో చిన్న రాజులను వశపర్చుకొనెను. యధిష్ఠిరుని తరువాత మొదటి మాధవవర్మయే రాజసూయము చేసెను. వాకాటకుల, కదంబుల మైత్రితో దక్షిణాపథమున ప్రబలి ఈక్రతువునుచేసియుండవచ్చును. తరువాత సామ్రాట్ బిరుదము నొందెను. పూర్వచక్రవర్తుల నధిగమించుటకు కృష్ణఒడ్డున అమరపురమువద్ద ఏకాదశాశ్వమేధములను ఇతర మహాక్రతువుల చేసెను. ఇతడు బలవంతుడు, అదృష్టవంతుడు. ఈతడు తన విజయయాత్రలలో మహాధనవంతుడై ఏకాదశగుణముల దక్షిణలిచ్చి దశాశ్వమేధ యాజియై తన సకల పాపములను బాపుకొనెను. ఆతడు 'లక్ష బహుసువర్ణ, పౌండరీక వాజపేయ, ఉక్థ్య, షోడశి ప్రౌఢిరాజ్య మున్నగు మహాక్రతువులను చేసె'ననుట ఆతడు మహాధనవంతుడని సూచించును.

ఈక్రతువులన్నియు రాజప్రాబల్య పటిష్ఠతకొరకు, మొదట ఆదిపజాతుల ఉత్సవములైనను, తరువాత రాజకీయ ప్రాముఖ్యత నొందెను. ఇది ఆంధ్రమున వీరబ్రాహ్మణోద్భవమును, బౌద్ధక్షీణతను సూచించును. ఇది విష్ణుకుండినుల ఒక ఘనకార్యము. చీనాయాత్రికుడు యువాన్ చ్వాంగ్ ఆంధ్రమునుగూర్చి స్పష్టముగా వ్రాయ లేకపోయినా, అమరావతి బౌద్ధవిహారము బ్రాహ్మణాలయముగ, అమరావతీశ్వర శివాలయ మయ్యెనని సూచించెను. ఇది మాధవవర్మకాలములోనే జరిగియుండును.

మొదటి మాధవవర్మ చక్రవర్తి ఏకాదశాశ్వమేధములు క్రీ. శ. 440 ప్రాంతంలో అతడుత్యున్నదశలో నున్నప్పుడు చేసియుండును. ఆతనికెవరు ఎదురు లేకుండుటచే చాలకాలము శాంతివైభవములతో మహాంధ్రసామ్రాజ్యమును (ఆంధ్రదేశపు ఎల్లలు దాటిన దానిని) పాలించియుండును. ఆంధ్రప్రతిష్ఠ బహుదూరము బహువ్యాప్తమై యుండెను.

అయిదవశతాబ్ది పూర్వార్థము చివరలో కదంబ మొదటి కృష్ణవర్మ, వాకాటక నరేంద్రసేనుడు, గుప్త మొదటి కుమారగుప్తుడు చిక్కులలో నుండిరి. మొదటి కృష్ణవర్మను పల్లవసింహవర్మ ఓడించి చంపెను. పుష్యమిత్రులు, సాధుమిత్రులు, పద్మమిత్రులు గుప్త వాకాటక సామ్రాట్టుల నెదిరించిరి. వీరు మాళ్వ, మధ్య భారతములోని గుప్త వాకాటక సామంతులు. విష్ణుకుండిన రాజులు గుప్త వాకాటకులకు సహాయమొనర్చి యుందురు. ఈ యుద్ధములలో గుప్త విష్ణుకుండిన సామ్రాట్టులు నిహతులైయుందురు. ఇది క్రీ. శ. 455 ప్రాంతమున జరిగియుండును. త్రైకూటకులును ధారాసేనుని నాయకత్వమున తిరగబడిరి. వాకాటకులకు, మొదటి కుమారగుప్తునికి, స్కంధగుప్తునికి మొదటి మాధవవర్మ సహాయపడియుండును.

మొదటి మాధవవర్మ తన కాలమున అందరిలోకి గొప్పరాజు. అతని కాలమున ఆంధ్ర మత్యున్నతదశలో ఉండి స్వర్ణయుగ మనుభవించెను. అతడు వివాహసంబంధములచే కదంబులు వాకాటకులతో చేతులుకలిపి వారికి, గుప్తులకు చేయూతనొసగి భారతదేశమును హూణుల బారినుండి రక్షించెను. ఇట్లు విష్ణుకుండినుల ఆంధ్రసామ్రాజ్యము భారతదేశమున గొప్ప ప్రతిష్ఠనొంది కీలకస్థానము నుండి దక్షిణభారత ఉత్తరభారతములను అచ్చటి సామ్రాజ్యములను కలుపు వారధి అయ్యెను. రామతీర్థశాసన మీతని నిందుచే 'ఊర్జిత శ్రీవిష్ణుకుండి పార్థివోదిత అన్వయతిలక సముద్భూత ఏకాదశాశ్వమేధ అవభృత్ అవధూత జగత్కల్మషస్య సహస్రక్రతు యాజిన' అని కీర్తించెను.

రెండవ దేవవర్మ, (క్రీ. శ. 455 ప్రాంతము) : ఇపూరు రెండవశాసన మతనిని 'క్షత్రియావస్కంచ ప్రవర్తిత అప్రతిమ విఖ్యాత పరాక్రమస్య' అని కీర్తించెను. ఈతడు తన తండ్రికి బహువిధముల యువరాజుగా సహాయపడెనని తోచును. అయినను అతని రాజ్యకాలముపద్రవముతో అంతమొందెను. అతడు రాజ్యమునకు వచ్చునాటికి గుప్తులు, వాకాటకులు, విష్ణుకుండినులు ఉత్తరభారతమున పుష్యమిత్రులకోడిరి. వాకాటక నరేంద్రసేనుడు త్రైకూటకుల ఒత్తిడిలో నుండెను. కదంబ మొదటి కృష్ణవర్మ పల్లవులచే నిహతుడయ్యెను. ఇట్లుత్తర, దక్షిణ సామ్రాట్టుల కిది క్లిష్టసమయము. పల్లవ మూడవసింహవర్మ విష్ణుకుండినులపైకి వచ్చి, దేవవర్మనోడించి చంపి దక్షిణాంధ్రము నాక్రమించెను. దీనిని సింహవర్మ (మూడవ) అమరావతిశాసనము సూచించును.

మూడవసింహవర్మ దక్షిణాంధ్రము నాక్రమించి అమరావతియందు తన

పుత్రుడు త్రిలోచన పల్లవుని (ముక్కంటి కాడువెట్టి) రాజప్రతినిధిగా నియమించెను. ఆతడు ధాన్యకటకముతోను సన్నిహితముగా నుండెను. ఆతడు క్రీ. శ. 460 వరకు పాలించియుండుటచే దేవవర్మ క్రీ. శ. 458 ప్రాంతములో మరణించి యుండును. దేవవర్మపుత్రుడు రెండవ మాధవవర్మ అమరావతిని వదలి ఉత్తరమునకు పోవలసి వచ్చెను.

3. రెండవ మాధవవర్మ (క్రీ. శ. 458-88 ప్రాంతము): ఈతడు తన యౌవనకాలమున రాజ్యమునకు వచ్చుసరికి ఆంధ్రము కుంతలకువలె పల్లవుల తాకిడికిలోనై దక్షిణాంధ్రమును వారికి పోగొట్టుకొనెను. మూడవ సింహవర్మ మృతి ఈతని కూపిరితీసుకొను అవకాశమిచ్చి తన వంశప్రాభవమును పునరుద్ధరించు అవకాశమును కలిగించెను.

ఈ క్లిష్టసమయములో మొదటి మాధవవర్మకు వశులైన చిన్న రాజులందరు స్వతంత్రులైరి. మధ్య కళింగములోని దేవరాష్ట్ర వాశిష్ఠ లిట్టి వారిలో ముఖ్యులు. వారు మాఠరులతో సంబంధములు కలిగియుండిరి. వారి పతనముతరువాత కొంతకాలమునకు కళింగమున వాసిష్ఠులు అయిదు లేక ఆరవ శతాబ్దిలో ప్రబలులైరి. దేవరాష్ట్రము ఎలమంచిలి నుండి భీముని పట్నమువరకు వ్యాపించియుండినట్లు తోచును. గుణవర్మ ఇట్లు దేవరాష్ట్రాధిపతికాగా ఆతని మనుమడు, మహారాజు అనంతవర్మ, క్రీ. శ. 460 తరువాత కళింగముననే ప్రబలుడై 20 సంవత్సరములకు పైన (క్రీ. శ. 460-85 ప్రాంతం) పాలించి, రెండవ మాధవవర్మకు సమకాలికుడై, ఆతనిచే నిర్జితుడైనట్లు తోచును. ఆతని తరువాతివారు తూర్పు గాంగులకు వశులైరి.

ఇతర పరిస్థితులివి. నాల్గవ స్కందవర్మ లేక త్రిలోచన పల్లవుని మృతి క్రీ. శ. 485 ప్రాంతంలో. తరువాత రెండవ కుమార విష్ణునివరకు పల్లవ చరిత్ర తెలియదు. ఈతడు క్రీ. శ. 515 చోళులనుండి కాంచీపురమును తిరిగి జయించెను. పల్లవరాజ్యమును పునరుద్ధరించెను. పల్లవుల క్షీణతతో వారికి కదంబులకు మధ్య కలహము లాగిపోయెను. చోళులు, కదంబులు వారినణచిరి. ఈ సమయమున రెండవ మాధవవర్మ తిరిగి దక్షిణాంధ్రమును జయించెను (క్రీ. శ. 485 ప్రాంతం). ఉత్తరమున గుప్తులు క్షీణించుచుండిరి. మధ్యభారతమునుండి వ్యాపించి మౌఖరులు ప్రబలులైరి. ఆరవశతాబ్ది ఆరంభమున గుప్తసామ్రాజ్యము లేదు.

వాకాటకులును క్షీణించిరి. రెండవ పృథ్వీసేనుడు (క్రీ. శ. 470-85

ప్రాంతము) దానిని కాపాడగలిగెను. మరల హరిసేనుని తరువాత ఆరవ శతాబ్ది మొదటి దశాబ్దమున వారి సామంతులు తలఎత్తిరి. మొదట అపరాంతములో త్రైకూటకులు వారి నెదిరించిరి వారిని చేది, దక్షిణకోసల, మేకల సామంతులును రెండవ పృథ్వీసేనుడణచెను. వాకాటక సామ్రాజ్యమును కాపాడి హూణులను నిలువరించిన వారిలో చివరివాడు హరిసేనుడు.

రెండవ పృథ్వీసేనుని వాకాటక సామ్రాజ్య సంరక్షణ రెండవ మాధవవర్మ ప్రయత్నములకు దోహదము చేసెను. ఆతడు తన రాజ్యకాలము చివర కళింగాధిపతి వాశిష్ట అనంతవర్మ నణచెను. వాకాటక సామంతులు, వాశిష్టుల మిత్రులై ఉందురు. వారు, వాశిష్టులు ఒకేసారి పతన మందిరి (క్రీ. శ 484 ప్రాంతం). వాకాటక విష్ణుకుండినులు ఈ ఉపద్రవముల నెదుర్చుటకు చేతులు కలిపి యుందురు (క్రీ. శ. 470-55 ప్రాంతం).

రెండు సంఘటనలు దక్షిణాంధ్రమున పల్లవాధికారాంతమునకు దారితీసెను. ఒకటి వాతావి, వేంగి చాళుక్యుల పూర్వీకుడు, విజయాదిత్యుని విఫల ప్రయత్నము (క్రీ. శ. 420 ప్రాంతం), రెండవది మొదటికరికాళ చోళుని కాలములో (క్రీ. శ. 480 ప్రాంతం) చోళప్రాభవము. ఇవి పశ్చిమాంధ్రమునకు సంబంధించినవి. పల్లవుల అధికారము దక్షిణాంధ్రమున కూలద్రోయు ప్రయత్నములివి. ఇవి విజయవంతమైన తిరుగుబాట్లు. సుదీర్ఘమైన పల్లవాంధ్ర పోరాటములో ముఖ్య ఘట్టములు. విజయాదిత్యుడు. కరికాళుడు పశ్చిమాంధ్రులు. వారికి పల్లవులన్న పడదు. ఏలనన పల్లవులు వారిని వారి హిరణ్యరాష్ట్రం, చోళవాడులనుండి తరిమిరి. చాళుక్యులు చేయలేని దానిని చోళులు పదేండ్ల తరువాత చేసిరి. చాళుక్యులకన్న చోళులకు విష్ణుకుండినులతో సంబంధము లెక్కువ. ఇర్వురిది సింహలాంఛనమే. ఇర్వురు శైవులే. రెండవ మాధవవర్మ ప్రయత్నములు వారిని ప్రోత్సహించెను. క్లిష్టసమయములో రెండవ మాధవవర్మ తన వంశప్రాభవమును పునరుద్ధరించెను. ఈతడు 30 సంవత్సరములు పాలించియుండును.

4. మొదటి విక్రమేంద్రవర్మ (క్రీ. శ. 488-93 ప్రాంతము) ఈతడు రెండవ మాధవవర్మ పినతండ్రి ఈతని జనని వాకాటక రాకుమార్తె. రాజ్యమునకు వచ్చుసరికి వృద్ధుడై 5 సంవత్సరములు పాలించియుండును. మొదటి మాధవవర్మ వాకాటక రాకుమార్తెను క్రీ. శ. 430 ప్రాంతమున పెండ్లాడియుండెను. మొదటి విక్రమేంద్రవర్మ క్రీ. శ. 435 ప్రాంతమున పుట్టియుండును. అందుచే ఆతడు

ష్టబది ఏండ్లు దాటినతరువాత రాజై యుండును. ఆతని సోదరుడు దేవవర్మ మృతి నాటికి (క్రీ. శ 458) అతను ఇరువదేండ్లపై వయసుకలిగి యుండును. అందుచే ఆతనికన్న పెద్దయిన సమర్థుడైన రెండవ మాధవవర్మ రాజాయెను. ఆతని మృతితో ఈతడు రాజుకాగలిగెను. ఆతని పుత్రుని రామతీర్థ శాసనమతనిని సత్పుత్రః అని చెప్పెను. ఆతడు విష్ణుకుండివ వాకాటక వంశముల వారిధి. ఆతని రాజ్యకాలము చాల తక్కువని తోచును. ఈతని పుత్రుడు ఇంద్ర భట్టారకుడు సింహాసనమునకై తన బంధువులతో పోరాడుటచే ఈతనిది నీరస పాలన అని తోచును. మరియు అతని పుత్రుని శాసన మతనిని 'రాజన్' అనే పిల్చెను. అతని మనుమని చికుళ్ల శాసనములో ఈ బిరుదుకూడ లేదు. 'శ్రీ విక్ర మేంద్రవర్మ, విష్ణుకుండినుల వాకాటకుల కానంద దాయకుడు' అనే అనెను. ఈతని నీరసపరిపాలన ఆతని తరువాత ఏడేండ్ల దురాక్రమణకు దారితీసెను.

విష్ణుకుండిన వాకాటక శాసనములు అతని తరువాత అంతః కలహములను సూచించు చున్నవి. ఈ కాలమున వాకాటకుల పరిస్థితులు బాగుండగా విష్ణుకుండినుల కట్లుకాదు. వాకాటక హరిసేనుడు మహారాజాధి రాజు బిరుదమును వహించి ఇతరుల వద్ద కప్పములు గైకొనెను. వాకాటక సామ్రాజ్యము ఉత్తర దక్కనులో కళింగాంధ్రములలో కూడ చొచ్చుకొని, వ్యాపించెను. కుంతలాంధ్ర రాజులాతనికి విధేయులు. ఆంధ్రములో రెండవ మాధవవర్మ, మొదటి విక్రమేంద్రవర్మల సంతతులకు వారసత్వ యుద్ధమారంభమై యుండును. రెండవ మాధవవర్మ పుత్రుడు హరిసేనుని సాయమర్థించి మొదటి విక్రమేంద్రవర్మను చంపి ఆతని సంతతిని పారద్రోలి యుండును. కళింగముకూడ వాకాటకులకు విధేయము. వాకాటక సామ్రాజ్యమాంధ్రమునకు మిత్రరాజ్యమై యుండెను. హరిసేనుడు కుంతలాంధ్ర కళింగముల సార్వభౌమత్వమును చెప్పికొనినా, కుంతలాంధ్రములమీద దాని ప్రభావము ఎక్కువకాలము లేదు. కొంతకాలము ఆరాజ్యములలో అతడు పెత్తనము చేసెను. ఆంధ్రములో అతని పెత్తనము క్రీ. శ. 492–502 ప్రాంతములోనై యుండును. ఇది మొదటి విక్రమేంద్రవర్మ తరువాత ఇంద్ర లేక ఇంద్ర భట్టారకుని కాలము వరకు జరిగియుండును.

5. ఇంద్రభట్టారకవర్మ (క్రీ. శ. 500–30 ప్రాంతము), ప్రాబల్యా ప్రయత్నము: ఆరవ శతాబ్దినుండి వాకాటకులు క్షీణించనారంభించిరి: ఆర్యావర్తము హూణుల వలన చికాకు పడుచుండెను. వాకాటకుల పరిసితి ఇటే ఉండెను. కుంతలము మరల ప్రబలు చుండెను.

ఈ సమయముననే ఇంద్రవర్మ వాకాటక రక్షితుని చంపి ఆంధ్రమునకు ప్రభువయ్యెను. చిక్కుళ్ళ శాసనములోని 'భరాభంగకర వినిర్ధూత సమగ్ర దాయాదస్య' అను ఇతని బిరుదు దానిని సూచించుచున్నది. 'స్ఫురన్నిశిత నిస్త్రింశ ప్రభావభాసితాశేష జగన్మండ ధిష్టితస్య' అను బిరుదు కూడ ఇట్లే సూచించుచున్నది. మరొకటి 'అనేక చతుర్దంత సమరసంఘట్ట ద్విరదగణ విపుల విజయస్య'. ఆతనిశాసనము కూడ ఇతనిని' అనేక చతుర్దంత సమరశతసంఘట్ట విజయి' అన్నది. మరొకటి' చతురుదధినృపతిమకుటమణి మయూఖ విస్ఫురిత పదాంబురుహ'. ఈ బిరుదములతడు బలవంతుడని ఆంధ్రమును అంతఃకలహముల తరువాత పునరుద్ధరించెనని చెప్పుచున్నవి. అతనికి రాజగుసరికి వయసు 30, 35 ఏండ్లుండును. ఆతడు జ్యేష్టుడు కాడు. 'ప్రియసుతః' అనే చెప్పికొనెను అతడు తన సోదరుని తరువాత గాని, అతనిని త్రోసివేసిగాని రాజై యుండును. ఇతడు క్రీ. శ. 510 ప్రాంతంలో వాకాటక హరిసేనుని కూలద్రోసి యుండును. వాకాటక సామంతులు కూడ స్వతంత్రులయిరి. తరువాత ఇతడు తన సామ్రాజ్యమును విస్తరింపచేసి దక్షిణాపథమున ప్రబలుడయ్యెను.

ఇంద్రభట్టారకుడు యుద్ధనిమగ్నుడైనా, సుదీర్ఘముగా విజయవంతముగా పాలించెను. చివరకు యుద్ధములో ఓడి, మరణించెను. ఆతని పుత్రుని చిక్కుళ్ళ శాసనము దానిని సూచించుచున్నది. మొదటి మాధవవర్మకాలములోవలె ఆంధ్రము ప్రబలెను. ఈతడు తన్ను 'పరమమాహేశ్వరుడ'నని చెప్పుకొనెను. రాజు పృధ్వీమూలుని గోదావరిశాసనం కూడ ఇతని గొప్పతనమును చాటుచున్నది. చిక్కుళ్ళ శాసనమప్పటి ఆంధ్ర ప్రాభవవైభవముల వర్ణించుచున్నది. రామతీర్థ శాసనమాతని రాజ్యము పలాకిరాష్ట్రము (బొబ్బిలి, చీపురుపల్లి) వరకు వ్యాపించినట్లు చూపును. కళింగ లేక త్రికళింగ అధిరాజు ఇంద్రుడు, అచ్చటి విష్ణుకుండిన సామంతుల కూడ గట్టుకొని ఆంధ్ర ఇంద్రభట్టారకుని కూలద్రోసెనని గోదావరి శాసనము సూచించుచున్నది. జర్జంగిశాసనము మహారాజు ఇంద్రవర్మను పేర్కొనుచున్నది. ఖమ్ఖెడేశాసనము ప్రతాపశీలుని (కాలచుర్యుడేమో) పేర్కొనుచున్నది. ఇట్లు పృధ్వీమూలుడు, ఇంద్రవర్మ, ప్రతాపశీలుడు ఈతనిని కూలద్రోసి యుందురు. యుద్ధము కళింగమున జరిగియుండును. రామతీర్థశాసము దానిని సూచించును. ఈతడు యుద్ధమున నిహతుడై యుండును. వాకాటకులు దీనినంతను ప్రోత్సహించి యుండవచ్చును.ఇంద్రవర్మ తూర్పుగాంగుడని వాకాటకసామంతుడుగా

త్రికళింగమున ప్రబలెనని, వాకాటకులవలె తూర్పుగాంగులు మొదట బ్రాహ్మణులు, విష్ణువృద్ధ గోత్రీకులని, ఇర్వురును విష్ణుకుండిన ధాటికోర్వలేక. ఇతర విష్ణుకుండిన సామంతులతో కలిసి అందరికి ప్రబలశత్రువైన ఇంద్రభట్టారకుని చంపిరని గోదావరి, జర్జంగిశాసనములు సూచించుచున్నవి. రెండవసారి ఇంద్రభట్టారకుని నాయకత్వములో విష్ణుకుండిను లుచ్చదశనొందిరి. ఈ కాలమున చాలమంది చిన్న చిన్న స్వతంత్రరాజులు తూర్పుదక్షిణాపథమున నుండిరి. దక్షిణాంధ్రమున విజయాదిత్యుని నాయకత్వమున చాళుక్యులు, కరికాలుని నాయకత్వమున చోళులు ప్రబలిరి. ఉత్తరమున వాకాటక సామంతులు స్వతంత్రులైరి. ఇట్లే విష్ణుకుండిన సామంతులు కూడ స్వతంత్రులుగా ప్రయత్నించుచుండిరి. ఇంద్రభట్టారకుడు తన శత్రులచేతిలో మడిసినా, ఆతని సామ్రాజ్యము ఏడవ శతాబ్దిలో ప్రథమ దశాబ్ది వరకు నిల్చెను.

గోదావరిశాసనము పృథ్వీమూలుని రాజన్ అని, అతని తండ్రి ప్రభాకరుని 'మహారాజ'ని పేర్కొన్నది పృథ్వీమూలుడు విష్ణుకుండినులకు లోబడి తరువాత తూర్పుగాంగుల సాయమున స్వతంత్రుడై వారి ఆధిక్యత నంగీకరించెను. అతని రాజ్యము గోదావరి ముఖద్వారప్రాంతమున నున్నట్లు తోచును. ప్రభాకరుడు, పృథ్వీ మూలుడు ఇంద్రభట్టారకుని జ్ఞాతివైరులై ఉందురు. ఇంద్రభట్టారకుడు ప్రభాకరుని కూలద్రోసి విష్ణుకుండిన ప్రాబల్యము పునరుద్ధరించగా, పృథ్వీమూలుడు ఇంద్ర భట్టారకుని కూలద్రోసినా, ఆంధ్రమున ప్రబలుడు కాలేకపోయెను. దానికి కారణము ఇంద్రభట్టారకుని పుత్రుడు, వారసుడు రెండవ విక్రమేంద్ర లేక విక్రమహేంద్ర వర్మ కూడ బలవంతుడగుటయే. ఈతడు పృథ్వీమూలుని, ఇంద్రవర్మను ఓడించి చంపియుండును. తూర్పుగాంగులు ముప్పది సంవత్సరములు మరుగునపడిరి.

6. రెండవ విక్రమేంద్ర లేక విక్రమహేంద్రవర్మ (క్రీ. శ. 530–540 ప్రాంతం) ఇంద్రభట్టారకుని పరాజయము, మృతి, విష్ణుకుండినులను తాత్కాలిక ముగా క్రిందుచేసినది. విష్ణుకుండినుల ప్రాబల్యము చెక్కుచెదరలేదు. ఆతని పుత్రుడు రెండవ విక్రమేంద్రవర్మ కడు సమర్థుడు. ఆతడు విష్ణుకుండిన సామ్రాజ్యమును రక్షించి బలపరచెను చిక్కుళ్ళశాసనమితని 'గరిష్ఠః శైశవ ఏవ సకల నృపగుణ అలంకృతః సమ్యగధ్యారోపిత సకలరాజ్య భారః' అన్నది. ఆతని మనుమని పొలమూరుశాసనము 'అప్రతిహతశాసనస్య ప్రతాపో పాత్త మనుజ పతిమండలస్య విరహిత అరిషడ్వర్గస్య విధివదుపచిత త్రివర్గస్య విబుధ

పతిసాధ్య శరవారవిభవ బలపరాక్రమస్య'అని అన్నది. అతడు అధిరాజు ఇంద్ర వర్మను అతని కూటమిని నాశనముచేసియుండును. తన పదవ రాజ్య సంవత్సర మున మరణించుసరికి త్రికళింగమును వశపర్చుకొనెను.

విక్రమహేంద్రవర్మ 'పరమమాహేశ్వరుడు'. మొదటి విక్రమేంద్రవర్మ పేరుతో సందిగ్ధము లేకుండ ఈతనిని విక్రమహేంద్రుడని యందురు. రాజ్యము నకువచ్చుసరికీతనికి మధ్యవయస్సు దాటియుండును.

7. గోవిందవర్మ విక్రమాశ్రయ (క్రీ.శ. 540-60 ప్రాంతం) : అతని పుత్రుడు గోవిందవర్మ రాజ్యమునకు వచ్చుసరికి యువకుడై యుండును. అతడు తన ఉత్తరదండయాత్రలో మరణించియుండును ఇదియు, తరువాతి ఓటమియు విష్ణుకుండిన ప్రాబల్యమును తగ్గించలేదు. మూడవ మాధవవర్మ రాజ్యారంభంలో అది కొంచెము తగ్గియుండును. ఆతని పుత్రునిశాసనము, సమకాలికుల శాసనములు ఇతని పరిపాలనాకాలమును గూర్చి తెలుపును. ఇపూరు మొదటి శాసనమితనిని 'భగవత్ శ్రీ పర్వతస్వామిపాదానుధ్యాత విష్ణుకుండి నామపరిమిత బలపరాక్రమస్య పరమధార్మికస్య ప్రణత సకలసామంతస్య అనేక గోహిరణ్య భూమిప్రదానస్య మహారాజశ్రీ గోవిందవర్మస్య' అన్నది. పొలమూరు శాసనము 'అనేక సమర సంఘట్ట విజయినః పరనరపతి మకుటమణి మయూఖావధౌత చరణయుగళస్య విక్రమాశ్రయస్య శ్రీ గోవిందవర్మస్య' అన్నది.

ఉత్తర మధ్య భారతముల చరిత్ర ఈతని వైభవమును తెలుపుచున్నది ఐదవశతాబ్ది ఉత్తరార్ధములో ఈ ప్రదేశములు చికాకులోనుండెను గుప్తులు క్షీణించుచుండిరి. వారు హూణులకు కప్పము చెల్లించుచుండిరి. హూణుల ధాటికి, యశోధర్ముడు, ఉత్తరగుప్తులు నిలువద్రొక్కికొనలేక పోయిరి. మౌఖరులు ప్రబలిరి. వారు ఆంధ్రులతో కలహించిరి. వాకాటకులు ఆరవశతాబ్ది ప్రథమదశాబ్దిలో నంతరించిరి. వారిర్వురు మధ్యభారతమును వశపర్చుకొన యత్నించిరి. ఇంద్ర భట్టారకుని నిర్జించిన కూటమికి మౌఖరి ఈశ్వరవర్మ సాయపడియుండును. విక్ర మహేంద్ర, గోవిందవర్మలు మౌఖరులు యెడల బద్ధమత్సరులై ఉండియుందురు. అటులనే తూర్పుగాంగుల యెడల కూడ. మౌఖరులు మహాకోసలమందలి సోమవంశి ఉత్తరగుప్తుల స్నేహమపేక్షించి యుందురు. మౌఖరుల జాన్పురశాసన మాంధ్ర ముతో కలహము తెలుపుచున్నది. వారాంధ్రుల వ్యాప్తి నరికట్టయత్నించిరి. ధారా, సురాష్ట రాజు లాంధ్రుల మిత్రులై యుందురు. అట్లే నూలికులు, గౌడులును.

సూలికులు శరభపురరాజులై యుందురు. మధ్యభారతమున గోవిందవర్మ మౌఖరుల వలన పరాజయానంతరము మరణించియుండును. చాళుక్య మొదటిపులకేశి కదంబులనుండి వాతాపిని నిర్జించి ప్రబలుడయి 'శ్రీవల్లభ' అను బిరుదు వహించెను. అగ్నిష్టోమాదివ్రతములు, అశ్వమేధము చేసెను. ఆతడు క్రీ. శ. 540 ప్రాంతమున ప్రబలుడై క్రీ. శ. 546 లో అశ్వమేధ మొనర్చియుండును. ఈ సందర్భమున తన్నెదిర్చిన గోవిందవర్మ నోడించి చంపియుండును.

8. మూడవ మాధవవర్మ జనాశ్రయ (క్రీ. శ. 546–611 ప్రాంతం) : ఈతడు శైశవముననే రాజ్యమునకు వచ్చియుండును. పొలమూరు శాసనమితని రాజ్యకాలము సుదీర్ఘమని తెల్పును. అప్పటి దక్షిణాపథ చరిత్ర ఇదియే సూచించును. ఇట్లు తన 65 ఏండ్లు సుదీర్ఘ పరిపాలనలో ఆంధ్ర సార్వభౌమత్వమును నిలిపెను. ఇపూరు మొదటి శాసనము, పొలమూరుశాసనము ఇతని ఘనతను కీర్తించుచున్నవి.

ఈతని బిరుదులు సమకాలిక వంశముల చరిత్రదృష్ట్యా ముఖ్యమైనవి. ఈతని రాజ్యారంభమునాటికి ఆంధ్రము చిక్కులలో పడెను. ఈ కాలముననే మిగత దక్షిణాపథవంశములు చిక్కులలో నుండెను. పల్లవ మూడవ కుమార విష్ణు (545–60) దక్షిణాపథముపై కన్నువేసి దాని నాక్రమించుకొనెను. కాని త్వరలోనే విష్ణుకుండినులు వారిని పారద్రోలిరి. ఇది క్రీ. శ 570 ప్రాంతమున అయియుండును. ఈ మూడు దశాబ్దముల విరామమును గూర్చి ఏమియు తెలియదు (క్రీ. శ. 550–80 ప్రాంతము). ఆరవ శతాబ్దంలో దక్షిణాపథ పరిస్థితిమారెను. బాదామి చాళుక్యులు పల్లవుల నడ్డిరి. రెండవ కృష్ణవర్మ నాటి నుంచి కదంబులు క్షీణించుచుండిరి. క్రీ. శ. 550–80 మధ్య దక్షిణభారతము పల్లవ, కదంబ, చోళ, చాళుక్య, పశ్చిమగాంగుల అనంతకలహములతో నిండి యుండెను. ఇట్లే దక్షిణాంధ్రమున పల్లవ విష్ణుకుండినుల కలహములుండెను. చివరకు విష్ణుకుండినులు విజేతలైరి. కోసలలో ఉత్తరగుప్తులు ప్రబలిరి. మహా శివగుప్త తీవరదేవుడు కోసలాధిపతిగా చెప్పుకొనెను. ఆతని సోదరుడు చంద్ర గుప్తుడు కళింగాంధ్రములను కూడ తాకెను.

మూడవ మాధవవర్మ పరిపాలనాకాల ప్రప్రథమ భాగము.' (క్రీ. శ. 546–70') తరువాతి ఉన్నతికి దారితీసెను. పల్లవులు, మహాకోసల సోమవంశులు, తూర్పు గాంగులు ఈతని నొత్తినను ఈతడు నిలువద్రొక్కుకోగలిగెను. 570 నుండి రెండు దశాబ్దులు ఈతని విజయకాలము. ఇపూరుశాసనమునాటికి దక్షిణాపథమున ఇతడు

సార్వభౌముడయ్యెను (క్రీ.శ. 583). పిష్టపురరాజులు వశులైరి. ఈనాటి కతడు ఏకాదశాశ్వమేధములు చేసియుండును. మహావిభవుడై హిరణ్యగర్భ మహాదానము, సహస్రాగ్నిష్టోమములు చేసియుండును. త్రివరనగర భవనగత (పరమ) యువతీ హృదయానందకారుడయ్యెను. ఆ రాజకుమార్తె నపుడు పెండ్లాడి యుండును. సోమవంశుల శ్రీపురము మహాకోసల గుప్తుల తివరనగరమైయుండును. మూడవ మాధవవర్మ కోసలచంద్రగుప్తు నోడించి అతని కుమార్తెను పెండ్లాడియుండును. చంద్రగుప్తునికి వివాహసంబంధాలతో మౌఖరి, సోమవంశులు, ఆంధ్రులు మిత్రులైరి. శ్రీశైల స్థలమహాత్మ్యము కోసలగుప్త, విషుకుండిన వివాహబాంధవ్యము సూచించును

ఇపూరుశాసనము కళింగముపై విష్ణుకుండినుల అధికారము సూచించును. విష్ణుకుండినులు పిష్టపుర రాజులను వశపర్చుకుని, కళింగమును లోబర్చుకొని అచ్చటి దేవరాష్ట్రమున ఈ దానమును చేసియుందురు. ఇపూరు పొలమూరు శాసనముల మధ్య దశాబ్దికాలములో (క్రీ.శ. 583-94)విష్ణుకుండినులు కళింగములో యుద్ధములు చేసినట్లగుపడును. వారికి తూర్పుగాంగులకు వైరము ప్రజ్వరిల్లెను. కొన్యోధరాజుల తూర్పుగాంగుల వైరము వారికి అవకాశము కలిగించెను. కాని తూర్పుగాంగులు ఉభయుల ఒత్తిడికి నిలువగలిగిరి. మూడవ మాధవవర్మకు తూర్పుగాంగ సమకాలికుడు రాజసింహ, రణభీత హస్తివర్మ. ఇతనిని క్రీ. శ. 577 తరువాత నిర్జించి యుండును. శైలోద్భవులు చాలకాలము కళింగమున సార్వభౌమత్వము నెరపిరి. క్రీ.శ. 577 నాటికి హస్తివర్మ శైలోద్భవులను నిర్మూలించెను. కాని క్రీ. శ. 580 లో మరణించెను. ఆతని మృతి ఆతని వారసుడు రెండవ ఇంద్రవర్మ రాజ్యమునకు ఏపరిస్థితిలో వచ్చెనో తెలియజేయును. ఈ కాలమున మాధవవర్మ కళింగమున దాడిచేసియుండును. నాలుగు దశాబ్దులు (క్రీ. శ. 587-627) తూర్పుగాంగ ప్రాబల్యము కళింగములో లేదు. ఈ మాధవవర్మను గురించి అనేక ప్రశంసలు, ప్రసక్తులుకలవు. పొలమూరు శాసనమతనిని 'అవనిత వివిధ దివ్యః' అన్నది. ఇది ఆతని న్యాయనిరతిని చాటును.

ఇపూరుశాసన కాలము (క్రీ. శ. 583 ప్రాంతం) నుండి 611 వరకు మాధవవర్మ అధికారమునకు కళింగమున ఎదురు లేదు. పల్లవులకు చోళులతో కలహముండెను. కదంబులు క్షీణించుచుండిరి. వారికి పశ్చిమగాంగుల తాకిడి ఉండెను. వారందరు కలహించుచుండగా చాళుక్యులు ఉత్తర మండలమున ప్రబలిరి. విష్ణుకుండినుల కెదురులేదు కాని ఏడవ శతాబ్ది ఆరంభమున విష్ణుకుండిన

ప్రభావము హటాత్తుగా నశించెను. దానికి కారణము చాళుక్య రెండవపులకేశి దిగ్విజయ యాత్ర. ఆతడు ఆంధ్రదేశమునాక్రమించెను. మొదట రేనాటివాసులైన చాళుక్యులు, పల్లవుల కెదురు తిరిగి ఓడి పడమటకు పోయి ఉత్తర మండలమున క్రమేణ ప్రబలి దక్షిణాపథ రాజ్యములను వశపరచుకొని చివరకు ఆంధ్రదేశము నాక్రమించి తాము ఆంధ్రసాతవాహనులవలె దక్షిణాపథ సామ్రాట్టులు కావలెనను ఆశయమును నెరవేర్చికొనిరి. పులకేశి ఆంధ్రమును తన సేనాని పృథివీదువరాజు ఇంద్రవర్మ కప్పగించి పల్లవుల నోడించి దిగ్విజయమును పూర్తిచేయుటకు కాంచి కెత్తిపోయెను.

చాళుక్యుల కాంధ్రమును పూర్తిగా వశపరుచుకొనుటకు ఒక దశాబ్ది పైగా పట్టెను. దానిని పులకేశి సత్యాశ్రయ పృథివీ ధృవరాజు ఇంద్రవర్మ (గోవా, కొప్పరము శాసనములలోని వారిర్వురు ఒకరే) నెరవేర్చెను. కొప్పరము శాసనము క్రీ. శ. 611 నాటి దగుటచే చాళుక్యు లాంధ్రము నప్పుడు జయించి మరొక దశాబ్దము తరువాత పూర్తిగా స్వాధీన పరచుకొనిరి.

9. విష్ణుకుండినుల చివరిదశ; మంచ్యణ్ణ భట్టారకుడు (క్రీ. శ 610–12 ప్రాంతం,): మాధవవర్మ మృతి తరువాత విష్ణుకుండిన సామ్రాజ్యము త్వరలో పతనమయ్యెను. వారి సామంతులు స్వతంత్రులగుటకు అదనుకై వేచియుండిరి. వారిలో ముఖ్యులు తూర్పుగాంగులు, పిష్టపురరాజులు. సామంతులెవ్వరు చాళుక్యుల నెదుర్కొనుటలో విష్ణుకుండినులకు సాయపడక యుండవచ్చును. మాధవవర్మ పుత్రుడు, వారసుడు అయిన మంచ్యణ్ణ భట్టారకుని స్థితి క్లిష్టముగా నుండెను. ఆతడొంటరిగా పలుశత్రులతో పోరవలసి వచ్చెను. పిష్టపురరాజు పృథ్వీమహారాజు ప్రబలుడు కాగోరి కళింగముపై దండువెడలెను. అతడు వేంగిపైకూడ దండువెడలి వేంగి తూర్పు భాగమును గోదావరి దక్షిణతీరమువరకు ఆక్రమించెను. ఉత్తర, ఈశాన్య దిశలనుండి ఇతని తాకిడి, దక్షిణ, నైఋతి దిశల నుండి చాళుక్యుల తాకిడి ఉండెను. కృష్ణా దక్షిణ తీరమువరకు చాళుక్యసేనాని పృథ్వీదువరాజు ఆక్రమించెను. మంచ్యణ్ణ భట్టారకుడు క్రీ. శ. 612 ప్రాంతంలో శత్రులచేతిలో నశించి యుండును. విష్ణుకుండిన ప్రాభవమాతనితో అంతరించెను.

రెండవ పులకేశి వాతాపికి మరలగనే పల్లవులు దక్షిణమునుండి, పృథ్వీ మహారాజు ఉత్తరమునుండి ఒకేసారి దక్షిణాంధ్రముపైకి నడచిరి. ఈ ముప్వురి కలహములలో మహేంద్రవర్మ (మొదటి మహేంద్రవిక్రమవర్మ) విజయుడై

దక్షిణాంధ్రము నాక్రమించెను. చేజెర్ల శాసనమీ పల్లవ విజయమును తెల్పుచున్నది. కందరానందుడు పృథ్వీదువరాజును చంపెను. ఈ ధాన్యకటక యుద్ధము క్రీ శ.617 ప్రాంతము జరిగినట్లగుపించును. యువరాజు విష్ణువర్ధనుడు ఆంధ్రమున కింకను రాలేదు. కుంతలముననే యుండెను. పులకేశి తన పూర్వీకుల దేశమైన ఆంధ్రము నాక్రమించుకొనుటకు తనసోదరుడును యువరాజును అయిన విష్ణువర్ధన విషమసిద్ధిని (క్రీ. శ 620 ప్రాంతమున) పంపెను. క్రీ. శ. 618 ప్రాంతమున విష్ణుకుండినులంతరించి. పిష్టపుర ప్రాబల్యము వెలసెను ఈతని కాలపు తండవాడ శాసనమతనిని 'ప్రవర్ధమాన ప్రతాపోపాన్త సమస్త సామంతమండల నిజభుజ విజయోదయాధిగత యశోవిశేష భూషణః' అన్నది. 'మాతృపితృ భక్తు'డని 'పరమ బ్రహ్మణ్యు'డని అన్నది. ఆతని రాజ్యకాలమర్ధశతాబ్ది (క్రీ. శ. 575-623). తండివాడ శాసనము క్రీ. శ. 620 ప్రాంతముదని తోచును.

విష్ణువర్ధనుడు పృథ్వీమహారాజును నిర్జించి పిష్టపురము రాజధానిగా ఉత్తరాంధ్రము నాక్రమించెను. ఆతని తిమ్మాపుర శాసనము దానిని తెలియచేయుచున్నది. తన 18 సంవత్సరముల రాజ్యకాలములో దక్షిణాంధ్రమునుకూడ ఆక్రమించి సర్వాంధ్రపతియై స్వతంత్రులై తూర్పుచాళుక్య వంశస్థాపకుడయ్యెను. చాళుక్య సామ్రాజ్యము కుంతలము, వేంగి భాగములై యుండి సామరస్యముతో నుండెను. చాళుక్య శాసనము లీతని సత్యాశ్రయ పులకేశి వల్లభుని 'ప్రియానుజుడ' నుచున్నవి. ఇతడు పల్లవులను, దక్షిణాంధ్ర సామంతులను, పృథ్వీమహారాజును తూర్పుగాంగులను నిర్జించెను. పశ్చిమమునుండి తన అనుయాయులను తెచ్చి ఆంధ్రమున వారిని తన సామంతులుగా వారి సేవలకు ప్రతిఫలముగా ప్రతిష్ఠించెను. దుర్గమ దుర్గములను సాధించుటచే విషమ సిద్ధి బిరుదాంకితుడయ్యెను. మరొక బిరుదు నరలోకవిక్రమ లేక త్రివిక్రమ. క్రీ.శ. 641 నాటికి ఆతడు సర్వకళింగ పతికూడ అయ్యెనని చీపురుపల్లి శాసనము తెల్పుచున్నది. క్రీ. శ. 624 ప్రాంతమున ఆంధ్రపతిగా అభిషిక్తుడై యుండెను. అప్పుడే విష్ణుకుండినుల పాలనకూడ అంతరించెను. పృథ్వీమహారాజుచే మంచణ్ణి భట్టారకుడు నిహతుడైన తరువాత విష్ణువర్ధనుడు విష్ణుకుండినుల పాలనను పూర్తిగా తుడిచిపెట్టెను. అట్లు ప్రాచీనాంధ్రమున విష్ణుకుండిన ప్రాభవ వైభవము అంతరించెను. కుబ్జ విష్ణువర్ధనుడు తనపేర నాణెములను ముద్రించెను. విష్ణుకుండినుల రాజధాని విజయవాడకూడ తన స్థానమును గోల్పోయెను. వారి సింహలాంఛనముకూడ పోయెను.

# 7. పూర్వపల్లవులు

## (క్రీ. శ. 250 - 620 ప్రాంతము)

ఆంధ్రసామ్రాట్టుల, ఆంధ్రభృత్యుల తరువాత పల్లవులు మూడవశతాబ్ది మధ్యలో కాంచీపురమున ఉద్భవించి దక్షిణాంధ్రమును కృష్ణానదివరకు ఏడవ శతాబ్ది ప్రథమపాదము వరకు పాలించిరి.

'పల్లవ' అనునది భారద్వాజగోత్ర బ్రాహ్మణ వంశనామమని పల్లవుల శాసనములు తెలియచేయుచున్నవి. మూడవ విజయనందివర్మ వేలూర్పాలయం శాసనము (తొమ్మిదవ శతాబ్ది మధ్యము) అశ్వత్థామ పుత్రుడైన 'పల్లవుని' సంతతి వారు అతని పేరునే తమ వంశనామము చేసికొనిరని చెప్పుచున్నది. చూతపల్లవ, వీరకూర్చ వర్మలు పల్లవ ప్రాభవకారకులు. వీరకూర్చవర్మ మూడవ శతాబ్ది మధ్యమున ఇక్ష్వాకులను. మాటుశాతకర్ణులను ఓడించి దక్షిణాంధ్రమును కృష్ణవరకు ఆక్రమించి కాంచీపురమును తన రాజదానిగా చేసికొని పల్లవ ప్రాభవమును నెల కొల్పెను. నృపతుంగవర్మ బహూర్ శాసనము, శీలహార మారసింహుని కరాద్ శాసనము, కశాకుడి శాసనము పల్లవులు కొంకణ, అనార్తములకు చెందినవారని, క్షత్రపమంత్రి సువిశాఖుని సంతతి వారని నవ(ఖండ) (కొంకణ) రాజ్యాధిపతులని, బ్రాహ్మణ పహ్లవుల సంతతి వారైనను భారద్వాజగోత్ర బ్రాహ్మణులై ఆంధ్ర భృత్యులతో సంబంధభాంధవ్యము కలిగియుండి మిగత బ్రాహ్మణ రాజవంశము లతో సమానగౌరవము పొందిరని తెలుపుచున్నవి.

పల్లవుల మూడు ప్రాకృత శాసనములు నాలుగు తరములను పేర్కొను చున్నవి: (1) మహారాజు బప్పస్వామి (హిరహదగళ్ళ శాసనము) 2. ధర్మమహా రాజాధిరాజు శివస్కందవర్మ (హిరహదగళ్ళ, మైదవోలు శాసనములు). 3. యువ మహారాజు విజయబుద్ధవర్మ, 4. బుద్ధ్యంకుర (బ్రిటిష్ మ్యూజియం శాసనములు). వారి సంస్కృత శాసనములలో ఒంగోడుశాసనము నాలుగుతరములను చెప్పుచున్నది: 1. మహారాజు కుమార విష్ణు, 2. మహారాజ శివస్కందవర్మ 3. వీరవర్మ, 4. మహారాజశ్రీ విజయస్కందవర్మ – శివస్కందవర్మ, కుమార విష్ణులు అశ్వమేధయాజులు. ప్రాకృత, సంస్కృత శాసనముల సమన్వయము

ఈక్రమమును సూచించుచున్నది. 1. కుమార విష్ణు (వీరకూర్చ, బప్పస్వామి) 2. విజయలేక శివస్కందవర్మ ఆతని పుత్రులు 3. యువమహారాజు విజయబుద్ధ వర్మ, 4. వీరవర్మ 5. బుధ్యంకుర (శివస్కందవర్మ పుత్రుడు). ఉరుపపల్లి, ఒంగోడు (రెండవ) పికిర, కూంగదూర్ చూర శాసనములు మరికొందరు రాజులను పేర్కొనుచున్నవి: కంద (స్కంద) వర్మ, మొదటి విష్ణు గోపవర్మ, రెండవ సింహవర్మ, రెండవ విజయ విష్ణుగోపవర్మ. చెందలూరు శాసనము రెండవ కుమార విష్ణుని పేర్కొనుచున్నది.

తొండై మండలము ఆంధ్రశాతవాహన సామ్రాజ్యభాగముగా నుండెడిది. తరువాత అది ఆంధ్రభృత్యుల (వనవాస కదంబ నాగరాజుల) చేతిలోనికి వెళ్లినది. వీరకూర్చవర్మ వారి రాజప్రతినిధిగా అచ్చట పాలించుచు కాంచిపురమును క్రీ. శ. 220 ప్రాంతములో నిర్మించి తన రాజధానిగా, చేసికొని విదప స్వతంత్రుడై, పల్లవప్రాభవమునకు మూలపురుషుడై ఉన్నట్లగుపడును. ఆతడు వనవస నాగరాజు కుమారిని పెండ్లాడి, స్వతః బలవంతుడై, క్రీ. శ. 233 ప్రాంతమున ఆ రాజ్యమును దాని రాజధాని అయిన వైజయంతిపురమును ఆక్రమించుకుని సర్వస్వతంత్రుడై దక్షిణ భారతపతి అయి ఉండును. కదంబులు, తమ మిత్రులు సంబంధులు అయిన ఇక్ష్వాకుల సాయముకోరగ వారిర్వుర పోడిమికి వీరకూర్చవర్మ తలవంచవలసి వచ్చెను. మరల క్రీ. శ. 252 ప్రాంతంలో కదంబుని, ఇక్ష్వాకు వీరపురుష దత్తుని మరణానంతరం వైజయంతి నాక్రమించుకొనెను. అప్పటి కిక్ష్వాకుల, కదంబుల బలము తగ్గినది. తరువాత కదంబులు తల ఎత్తగలిగినా ఇక్ష్వాకులు మాత్రము అడగిపోయిరి. ఇట్లు వీరకూర్చవర్మ దక్షిణమున ఎదురులేనివాడై, కృష్ణ, తుంగభద్ర, కావేరుల మధ్యదేశమును తన సామ్రాజ్యము కావించుకొనెను. తన ఈ ప్రాభవ సూచనగా అశ్వమేధయాజి అయ్యెను. ఇది క్రీ. శ. 263 ప్రాంతమున అయి ఉండును. దక్షిణాంధ్రము (ఆంధ్రపథము) లోని పల్లవ ప్రాకృత, సంస్కృత శాసనములు దీనిని సూచించును. క్రీ శ. 260 ప్రాంతమున దక్షిణాంధ్రము నాతడాక్రమించి యుండును.

వీరకూర్చ, మొదటి శివస్కందవర్మలు ఇక్ష్వాకుల దక్షిణాంధ్ర సామ్రాజ్య భాగము నాక్రమించుకొనుటే కాక, వారి బిరుదములను వహించి అన్నివిధముల వారి ననుకరించిరి. వీరకూర్చ వర్మ క్రీ. శ. 230 ప్రాంతమున కాంచీపురమును నిర్మించి, క్రీ. శ. 252 ప్రాంతమున విస్తృత కాంచీరాజ్యమునకు ప్రాభవమును

కల్పించి, మైదవోలు శాసనము ప్రకారము క్రీ. శ. 265 ప్రాంతము వరకు దానిని పాలించి నట్టగుపడును. అప్పటి కాతడు బాగుగా వృద్ధుడై యుండును. అతని మరణానంతరం మొదటి శివస్కందవర్మ రాజయ్యెను. రాయకోట శాసన మాతని పుత్రుడు స్కందశిష్యుడు (శివస్కందవర్మ), బ్రాహ్మణఘటక (ధాన్యకటకము)ను సత్యసేనుని (ఇక్ష్వాకుల అనంతరమున ప్రబలిన ఒక శకరాజు,)నుండి ఆక్రమించుకొని, దక్షిణాంధ్రమున పల్లవాధికారము పటిష్ఠముచేసినట్లు సూచించును. ఏడవ శతాబ్దిలో పల్లవాధికార మంతరించు వరకు అది పల్లవరాజ ప్రతినిధుల రాజధానిగా నుండెను. క్రీ. శ. 250–270 ప్రాంతం పల్లవ, ఇక్ష్వాకుల పోరాటకాలము, క్రీ. 270 ప్రాంతమున ఇక్ష్వాకుల నణచి (శివస్కందవర్మ రాజ్య మధ్యకాలము) పల్లవరాజు వాజపేయాశ్వమేధముల నొనర్చియుండును. శివస్కందవర్మ ఇక్ష్వాకులవలె చక్రవర్తి బిరుదు వహించెను. ఈతని రాజ్యకాలము పదిసంవత్సరములు (క్రీ. శ. 265–75 ప్రాంతము) అయి ఉండును.

యువమహారాజ విజయబుద్ధవర్మ తన తండ్రి మొదటి శివస్కందవర్మ రాజ ప్రతినిధిగా ధాన్యకటకము రాజధానిగా దక్షిణాంధ్రమును పాలించి తన తండ్రి తరువాత పదిసంవత్సరములు సామ్రాజ్యమును పాలించియుండును. ఆతని తరువాత అతని పుత్రుడు బుధ్యంకురుడు పాలించెను. (క్రీ. శ. 275–85 ప్రాంతం). ఈతనికి పుత్రులు లేకపోవుట వలన ఇతని పినతండ్రి వీరవర్మ రాజ్యమునకు వచ్చెను వీరిరువురు దక్షిణాంధ్ర, కుంతలములలో తమ అధికారము నిలపెట్టు కొనుటకు నిత్యము పోరవలసి వచ్చెను. దర్శిశాసనము దానిని సూచించుచున్నది. మొదటి శివస్కందవర్మ మృతి తరువాత దక్షిణాంధ్రమున కొంతభాగము పల్లవులు కోల్పోయిరి. బృహత్పలాయనజయవర్మ వారి సమకాలికుడు. బృహత్పలాయనుల తరువాత పల్లవులకు ఆనందులకు పోరాటము జరిగెను. బుధ్యంకుర, వీరవర్మలు ఈ పోరాటములలో మడిసి యుందురు. వీరవర్మ పుత్రుడు రెండవ విజయస్కందవర్మ కాలము వరకు దక్షిణాంధ్రమును పూర్తిగా పల్లవులు వశపర్చుకోలేక పోయిరి. ఇతని పరిపాలన కాలము క్రీ. శ. 295–330. ఈతని కాలమునుండి సంస్కృతశాసనములను పల్లవులు ప్రకటించ మొదలిడిరి. ప్రాకృత శాసనముల లోని 'పలవ' 'పల్లవ' అయినది.

విజయస్కందవర్మ కాలమున కదంబులు మయూరశర్మ నాయకత్వమున స్వతంత్రులయిరి. మయూరశర్మ చంద్రవల్లి శాసనము దానిని సూచించు

చున్నది. మయూరశర్మ వైజయంతిలో క్రీ. శ. 310 ప్రాంతమున పట్టాభిషిక్తు డయ్యెను. కదంబులు ఆంధ్రమున నైఋతి భాగమును కూడ ఆక్రమించిరి దక్షిణాంధ్రమున ఆనందులు కూడ క్షీణించగా ఉత్తరాంధ్రమున సాలంకాయనులు ప్రబలిరి. విజయస్కందవర్మ పుత్రుడు మొదటి సింహవర్మ పరిపాలనాకాలము (క్రీ. శ 330-42)న పల్లవ, సాలంకాయనులకు మైత్రి యుండుటచేతను, మయూర వర్మ మృతినొందుటచేతను, సింహవర్మ దక్షిణాంధ్రమును తన సోదరుడు యువ మహారాజు మొదటి విష్ణుగోపవర్మ కప్పగించి తాను కుంతలమును పాలించుటకు పోయి ఉండును. వారసులు లేనందున ఈతని అనంతరం విష్ణుగోపవర్మ రాజయ్యెను (క్రీ. శ. 342-60). ఈతడు సాలంకాయన హస్తివర్మతోను, ఇతర రాజులతోను కలసి సముద్రగుప్తుని జైత్రయాత్రను నిరోధించెను. నాల్గవశతాబ్దము నుండి పల్లవులు క్షత్రియులుగా పరిగణన నొందిరని దర్శిశాసనము సూచించు చున్నది.

మొదటి విష్ణుగోపవర్మ తరువాత అతని పుత్రుడు ఉగ్రవర్మ (సేనుడు) రాజయ్యెను (క్రీ. శ. 360-3). ఈతడు కదంబుల కోటుపడి వారసులు లేక మృతినొందుటచే ఈతని సోదరుడు రెండవసింహవర్మ (ధర్మమహారాజు) రాజయ్యెను (క్రీ. శ. 363-85). దానితో పల్లవ, కదంబుల పోరాటములో రెండవదశ ముగిసెను. 'ధర్మ' అనుపేరు ధర్మపునరుద్ధరణ సూచించును. వారిర్వురి కాలములో పల్లవులకు ఆనందులతోను, హిరణ్యరాష్ట (రేనాడు) వేంగో రాష్ట్రము లందలి చోళులతోను పోరాట మారంభమయ్యెను. రెండవ సింహవర్మ తరువాత అతని పుత్రుడు రెండవ విజయ విష్ణుగోపవర్మ (క్రీ. శ. 385-400) రాజయ్యెను. ఈతని కాలమున సాలంకాయనులు కూలి విష్ణుకుండినులు ప్రాబల్యములోకి రాగా పల్లవ విష్ణుకుండినుల సుదీర్ఘపోరాట మారంభమాయెను. తరువాత మూడవ కుమార విష్ణువరకు పల్లవశాసనములు లేవు. తరువాత మూడవ స్కందవర్మ (క్రీ. శ. 425-36), మూడవ సింహవర్మ (క్రీ. శ. 436-60) పాలించినట్లు తోచును. ఈకాలములో మొదటి మాధవవర్మ విష్ణుకుండినుని రాజ్యకాలములో పల్లవ ప్రాభవము మరుగుపడి, ఆతనిమృతి తరువాత తిరిగి తలయెత్తినట్లు తోచును. తరువాత రాజులు: నాల్గవ విజయ స్కందవర్మ (క్రీ.శ. 460-95), శాంతివర్మ (క్రీ.శ, 495-503), మూడవ కుమారవిష్ణు (క్రీ.శ. 503-20), మొదటి నందివర్మ (క్రీ.శ. 520-35), రెండవ బుద్ధవర్మ (క్రీ.శ. 535-45), మూడవ కుమారవిష్ణు (క్రీ.శ. 545-560),

నాల్గవ సింహవర్మ (క్రీ. శ. 560-80). ఈ దశాబ్ది మరల పల్లవులకు క్లిష్టకాలమై యుండును. ఆ తరువాతివారు సింహవిష్ణు (క్రీ శ. 580-600), మొదటి మహేంద్ర (విక్రమ) వర్మ (క్రీ. శ. 600-30).

మూడవ సింహవర్మ తిరిగి దక్షిణాంధ్రమును తనపరిపాలనా కాలము చివరలో ఆక్రమించి గోదావరినికూడ అతిక్రమించినట్లు అమరావతిశాసనము సూచించు చున్నది. అతని తరువాత అతని పుత్రుడు విజయస్కందవర్మ రాజయ్యెను. ఈతని కాలములో క్రీ. శ. 472-6 ప్రాంతమున విష్ణుకుండిన రెండవ మాధవవర్మ దక్షిణాంధ్రము నాక్రమించెను కృష్ణవద్దనున్న చోళవాడినుండి కరికాళ చోళ ఘనుని క్రింద విజృంభించి చోళులు పల్లవులను చికాకుపరచిరి. చోళవాడి (రేనాడు లేక హిరణ్యరాష్ట్రము) కడపమండలమున నున్నది. ప్రాచీన చోళశాసనములు ఈ మండలమును పేర్కొనుచున్నవి. వారిది సింహలాంఛనము. చోళశాసనములు కరికాలుని పూర్వికుడు ఇక్ష్వాకుడని చెప్పుచున్నవి. ఆంధ్ర,తమిళచోళులీతని సంతతివారే.ఇక్ష్వాకుల నణచిన పల్లవుల మీద వీరికిద్వేషము. వారి దక్షిణాంధ్రాక్రమణ దానిని ప్రజ్వలింపచేసెను. విజయస్కందవర్మకు త్రిలోచన, త్రినయన, త్ర్యంబక, ముక్కంటి (కాడువెట్టి) అనునవి నామాంతరములు. మూడవసింహవర్మ బౌద్ధోపాసకుడు కాగా. నాల్గవవిజయస్కందవర్మ శైవుడు. హిరణ్యరాష్ట్రవాసియైన చాళుక్య విజయాదిత్యుడు కూడ స్వతంత్రుడుకాగోరెనుగాని పల్లవులచేతిలో ఓడి మరణించెను. దక్షిణాంధ్రమున చాల శాసనములు త్రిలోచనుని పేర్కొనుచున్నవి. క్రీ. శ. 460-70 విష్ణుకుండినులతోను, 475 ప్రాంతమున కదంబులతోను పోరి 480-85 లో చోళులచే నిర్జితుడై వారి సామంతుడుగా ఇతడు మరణించియుండును. పల్లవులతిరిగి బలవంతులై క్రీ. శ. 510-20 లో చోళుల నోడించిరి. శాంతివర్మ చండదండుడు చోళులను నిర్జించెనుకాని కదంబులచే నిర్జితుడాయెను. అతని సోదరుడు రెండవ కుమారవిష్ణు పల్లవప్రాభవమును పునరుద్ధరించెను. అతని కుమారుడు రెండవ బుద్ధవర్మ చోళులను పూర్తిగా నిర్జించెను. ఈతడు తన రాజ్యకాలము చివర, క్రీ. శ. 543న, దక్షిణాంధ్రము నాక్రమించెను. అతని పుత్రుడు మూడవ కుమారవిష్ణు దక్షిణాంధ్రమును గోల్పోయి చోళులచే నిహతుడై యుండును. ఇతనికి వారసులు లేరు. ఇతని తరువాత పల్లవులు దక్షిణాంధ్రమున విష్ణుకుండినులున్నంత కాలము తలఎత్తలేదు. వారి పతనము తరువాత పల్లవ మొదటి మహేంద్ర (విక్రమ) వర్మ తిరిగి దక్షిణాంధ్రమును జయించెను. క్రీ. శ. 635 ప్రాంతమున

కుబ్జ విష్ణువర్ధనుడు పల్లవులను దక్షిణాంధ్రమునుండి పూర్తిగా తరిమివేసెను. ఆంధ్రమునంతను ఒక ఏలుబడికితెచ్చు విష్ణుకుండినుల ప్రయత్నము ఇట్లు తూర్పు చాళుక్యులచేతిలో పూర్తిగా ఫలించెను. పల్లవులది వృషభలాంఛనము. వారి ధ్వజము ఖట్వాంగము లేక కపాలదండము.



# 8. సాతవాహనానంతరీకుల కాలమున వివిధ పరిస్థితులు

సాతవాహన సామ్రాజ్యము క్షీణించిన తరువాత వారి సామంతులు వారి సామ్రాజ్య వివిధప్రాంతములలో ప్రబలి శాంతిభద్రతలను నెలకొల్ప యత్నించిరి. ఇది ఏడవ శతాబ్దమున చాళుక్యసామ్రాజ్య ముదయించువరకు సాగెను. ఉత్తర ఆంధ్రమున ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, ఆనందులు, సాలంకాయనులు, విష్ణుకుండినులు, సాతవాహనులు లేనిలోటు తీర్చయత్నించిరి. వారన్ని విషయముల లోను సాతవాహనుల ననుకరించిరి. వారిలో ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు సర్వాంధ్ర పతులేగాక దక్షిణాపథపతులుకూడ కాగలిగి సార్వభౌమాధికారము నెరపిరి. ఇతర సాతవాహన ప్రాంతములందలి సాతవాహనాంతరీకులపై (ఆంధ్ర భృత్యులు లేక చూటుసాతకర్ణులు, కదంబులు, ఆభీరులు, వాకాటకులు, శైలోద్భవులు, తూర్పుగాంగులపై) కూడ వీరి ప్రభావము ఉంటూ ఉండెను. సాతవాహనరాజ్యాంగము, రాజోద్యోగుల నామాలు, రాజకీయ విధానములు, ఆశయములు వీరి కాలమందును సాగెను. వారితర రాజ్యములతో ముఖ్యముగా పల్లవులతో, యుద్ధములు తరుచుగా చేయవలసి వచ్చినా, ఉత్తరాంధ్రమును సంఘటితముచేసి తమ ప్రాభవమును నెరపగలిగిరి. ఇక్ష్వాకుల తరువాత నుండి మూడు శతాబ్దములు దక్షిణాంధ్రము కృష్ణానదివరకు పల్లవుల ఆధీనములో నుండెను. వారి పాలనలో కూడ దక్షిణాంధ్రము శాంతిభద్రతల ననుభవించకలిగెను. ఇట్లు సాతవాహనాంతరీకుల ప్రాభవము క్రింద ఆంధ్రమున చాల భాగము తన వ్యక్తిత్వమును నిలపెట్టుకో కలిగెను. ఇక్ష్వాకుల, విష్ణుకుండినుల కాలమున సర్వాంధ్రము ఏకమై మరింత వ్యక్తిత్వమును సంతరించుకొనగలిగెను. అంతేకాదు; కుంతల, కళింగములపై కూడ ఆంధ్రము ప్రభావము కలిగియుండెను. ఈ సాతవాహనానంతరీకులు తమ పరిధులలో తమ శక్తిమేరకు సర్వశ్రేయస్సును సమకూర్చ యత్నించుచు చాల మట్టుకు కృతకృత్యులైరి. ఆంధ్రవ్యక్తిత్వము, అభివృద్ధిక్రమము కుంటువడక వీరి కాలములో కూడ వృద్ధిచెందెను.

ఈ కాలములోని శాసనములు, నాణెములు ఇతర ఆధారములు ఆంధ్రమున ఆర్థికపరిస్థితులు కూడ చక్కగా నున్నట్లు తెలియచేయుచున్నవి. రాజ్యములో వర్తకవ్యాపారములు, వివిధవృత్తులేకాక సముద్రాంతర దేశములతో వర్తకవ్యాపార

ములు కూడ అభివృద్ధిదశలో నుండి దేశము సుసంపన్నముగా నున్నట్లుతెలియచేయు చున్నవి. రాజుల దానధర్మములు, వివిధ క్రతువులు, బౌద్ధకట్టడముల పునరుద్ధరణ, నాణెములపై ఆయా చిహ్నములు దేశములోని ఆర్థిక పరిస్థితులు చక్కగా నున్నట్లు సూచించుచున్నవి. ఇది సంఘములోని వివిధభాగములు తమతమ పరిధులలో శక్తివంచనలేక పరస్పర సామరస్యముతో ప్రవర్తించిననేకాని సాధ్యముకాదు. సంఘములో బౌద్ధులు, బ్రాహ్మణమతస్థులు, వివిధ విభిన్నతలు గల సంఘము లున్నను అవి రాజ్యపు నాయకత్వమున పరస్పర సామరస్యముతో మెలగి నట్లనిపించును.

ఇక్ష్వాకుల కాలములో వారు బ్రాహ్మణులై బ్రాహ్మణ కర్మ లాచరించినా బౌద్ధము బాగుగనే ఉండెడిది. శాసనములను బట్టి రాజభాష ప్రాకృతమై యుండెనని తోచుచున్నది. రాజకుటుంబ స్త్రీలు బౌద్ధమును చాల ఆదరించిరి. ఇక్ష్వాకుల తర్వాత నుండి బౌద్ధము ఎక్కువ ఆదరణ పొందినట్లగుపించదు. అంతేకాక బ్రాహ్మణ మతము, శైవవైష్ణవముల, ప్రాతివదికతో పునరుజ్జీవనమునొందినది అట్లేప్రాకృతము కూడ మరుగునపడిసంస్కృతము తలఎత్తసాగినది. నాల్గవ శతాబ్దమునుండి బౌద్ధము ఆంధ్రమున, దక్షిణాపథమున క్షీణించ నారంభించి చివరకు అంతరించినది. అయినను మతము ఏదయినను రాజ్యము, ప్రజలు మతదురభినివేశము, మతకలహ ములు లేక పరస్పర సామరస్యముతో ఉన్నట్లు తోచును.

ఇంతేకాక ఆంధ్రము సాతవాహనుల కాలములోవలె మహాంధ్రముగా నుండె డిది. సముద్రాంతరదేశములతో వర్తక వ్యాపారములలో పైచేయి కలిగి యుండెను. సంస్కృతిరంగమున ముఖ్యముగా బౌద్ధ సంస్కృతి, ప్రపంచఖ్యాతి బడసెను. క్రీ. శ. మొదటి శతాబ్దమున దేశము ఆచార్య నాగార్జునుడార్జించి పెట్టిన ఖ్యాతిని నిలపెట్టుకోగలిగెను. వివిధదేశముల నుండి ఇచ్చటకు విద్యనేర్చుకొనుటకు వచ్చిన యూవాన్‌చ్వాంగ్ వంటి బౌద్ధ చైనా యాత్రికులు ఆంధ్ర సంస్కృతిని మెచ్చు కొనిరి. అప్పుడు ఆంధ్రులు వర్తక వ్యాపారముల కొరకేకాక ఆంధ్ర సంస్కృతిని వ్యాపింప చేయుటకు వివిధ సముద్రాంతర ప్రాంతములకేగి, అచ్చట వలసలు స్థాపింట స్థిరపడి సాతహహనుల కాలములో మహాంధ్ర వ్యక్తిత్వమును కూడ నిలపెట్ట గలిగిరి. ఆంధ్రసంస్కృతి ప్రభావము వివిధ సముద్రాంతర దేశములలో (బర్మా, సింహళము, మలయా, సయాము, ఇండోచైనా వంటి దూర ప్రాచ్య దేశములలో) వ్యాపించినది. నేటికిని దాని చిహ్నములను పరికించ వచ్చును.

# సింహావలోకనము

మూడవశతాబ్ది మధ్యభాగము నుండి రమారమి ఏడవశతాబ్ది మధ్యభాగము వరకు అనగా సుమారు నాల్గు శతాబ్దములు ఆంధ్రము సాతవాహనుల కాలములోని తన ప్రత్యేకవ్యక్తిత్వముల గోల్పోయినదని కొందరనిరి. కాని ఈ పరిశీలనదృష్ట్యా అట్లుకాదని తోచుచున్నది. సాతవాహనుల తరువాత ఆంధ్రమున విలసిల్లిన రాజులు, రాజ్యములు ఆంధ్ర వ్యక్తిత్వ ప్రాభవముల నిలబెట్టి సంరక్షించ గలిగిరి. దేశమున సాతవాహన సంప్రదాయములను, చక్కగ కొనసాగించి సముద్రాంతర దేశములలో ఆంధ్ర వక్తిత్వమునకుగల ఖ్యాతిని సంరక్షించ కలగిరి.

ఇంతేగాక మరొక ముఖ్యవిషయమును గమనించవలసి యున్నది. సాతవాహను లాంధ్రసామ్రాట్టులైనను, ఆంధ్రమువారి సామ్రాజ్యాంతర్భాగముగా మాత్రమే యుండెడిది. మూడవ శతాబ్ది మధ్యభాగమునుండి సాతవాహనంతరీకుల కాలములో ఆదేశము తన పరిపూర్ణ వ్యక్తిత్వమును, సార్వభౌమత్వమును సంతరించు కొనుటే కాక సామ్రాజ్యాధిపత్యము కూడ కొన్ని కాలములలో అనుభవించినది. అనగా సాతవాహనానంతరీకుల ప్రారంభము, ఆంధ్రముయొక్క పరిపూర్ణవ్యక్తిత్వ సార్వభౌమత్వముల ప్రారంభము కూడ. తరువాత వచ్చిన చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులుకూడ దీనిని నిలబెట్ట గలిగిరి మరల విజయనగర సామ్రాజ్య కాలములో ఆంధ్రము ఒక మహాసామ్రాజ్యాంతర్భాగమై పోయెను. ఇట్లు సహస్రాబ్దికి పైగా నున్న ఆంధ్రముయొక్క ఈ విశిష్టత ఈ సాతవాహనానంత రీకుల కాలములో ఉద్భవించినది. సాతవాహనుల కాలములో సామ్రాజ్యాంతర్భాగముగ ఉండిన ఆంధ్రమునకు తమ కాలమున ప్రత్యేకవ్యక్తిత్వమును సంతరింపజేసి నిరాటంకముగ దీనిని వారు కొనసాగింప జేసిరి.

